# ఆంధ్ర రఘువంశ మహాకావ్యము

( కాళిదాస రఘువంశమునకు అనువాదము. )

గ్రంథకర్త:

మరిచెర్ల జగన్నాథనాయుడు



 [వెల 2-0-0

# ఆంధ్ర రఘువంశ మహాకావ్యము

( కాళిదాస రఘువంశమునకు అనువాదము. )

గ్రంథకర్త:

మరిచెర్ల జగన్నాథనాయుడు



సర్వస్వామ్యసంకలితము] 1947 [వెల. 2—0—0

తే. ఘనుఁడు శ్రీనాథుఁ డను నొకకవివిధాత
చేసి యిడె నైషధాశేషసిద్ధకావ్య
కన్య రసభావలౌల్య తాకర్షణముల
రసికులకుఁ జేర్పఁ గవులకు రచనఁ గూర్ప.

తే. నైషధం బను విద్వజ్జ నౌషధంబు
ప్రబలతరయోగరసశుద్ధి భాసురముగఁ
జేసి యిడెఁ గావ్యపంచిక సిద్ధముగను
ఘనయశుం డగు శ్రీనాథకవిభిషజుఁడు.

ప్రకాశకులు

మరిచెర్ల జగన్నాథనాయుడు

లక్షణాపురము, పార్వతీపురము తాలూకా

# విజ్ఞప్తి

ఆంధ్ర భాషాభిమానులారా!

మానవుల మనో భావములు వికసింపఁజేసి మానవునియందున్న పశుత్వమును పాఱద్రోలి దైవత్వమును ప్రతిష్ఠించుటలో సద్గ్రంథము లెంతయు సహకారులగుటచే నయ్యవి యెఱుంగుటకు పండితు లిప్పటికిని కళాశాలలలో మున్ముందు విద్యార్థులకు కావ్యపఠన మత్యవసరముగఁ జేయించుటకలదు. అయిన నిప్పటియుగధర్మమునుబట్టి కారణాంతరములు వచ్చి యిప్పు డీభాషావ్యాప్తి తగ్గుచుండుటవలన మొదటచదువు కొన్నవారే బహుతక్కువమందిగల మనఆంధ్రులలో సంస్కృతము నేర్చినవారు మిక్కిలి అరుదని చెప్పఁగలము. ఇట్టిపరిస్థితిలో కావ్యజ్ఞప్తి బొత్తిగాలోపింపఁబడకుండవలయుననేతలంపున చదువరు లించుక ఆంధ్ర భాషాసేవాదృష్టితో నైనా ఈకావ్యము పఠింతురనే విశ్వాసముతో నేనొనర్చుకొను సంకల్పమే నన్ను మహాకవికాళిదాసప్రోక్తమైన రఘువంశమహాకావ్యమును తెనిఁగించుట కుద్యమింపజేసినది. ఇకా వ్యమును చదువరులంత శ్రమవహింపక సులువుగ గమనింపఁగలుగుఁ సరళమున విపరీతము నొందింపక వీలైనంతవరకు సులభశైలిని వ్రాసి ఆంధ్ర రఘువంశమహాకావ్యమనే పేరుపెట్టియున్నాను. దీనివాడుకలో పాఠకలోకము చూపే యాదరణపైనే నాగాఢవాంఛితములైన ఆంధ్ర ప్రపంచసేవాభివృద్ధి, ఆంధ్రులసర్వతోముఖస్వరూపసిద్ధి ఆధారపడి యున్నదనే విశ్వసించుచున్నాను.

కల్తీలేని కర్షకుఁడనై కృషికర్మలనాచరించుచు నేఁటికి పది మూఁడుసంవత్సరములక్రితము ప్రథమ ద్వితీయసర్గలు తెనిఁగించి మిన్నకుంటిని. అట్లుండ ఈనాఁటికి భాషాభిమానులగు కొందఱుస్నేహి తుల ప్రోత్సాహపూరితమైన యొత్తిడివలన మఱల అనువాద ప్రయత్న మునకు పూనుకొనిమొదాఱుసర్గలుపూర్తి చేసి. ఈనాలుగు సర్గలు

మాత్రము యిందు పొందుపరచడమైనది. నాయీ ప్రథమ ప్రయత్నము పట్ల పాఠకసోదరులు చూపు ఆదరణవల్ల పొందే నూతనోత్సాహములో ప్రస్తుతము విడిచిపెట్టియున్న మూడు, నాలుగు, సర్గలు పూర్తి చేసి పుస్తకములో సక్రమముగా చేర్చెదను.

కోరినంత మాత్రముననే నాయీ గ్రంథమును పరిశీలించి తమ యమూల్యములైన విమర్శనాపూర్వ కాభిప్రాయములు వ్రాసియిచ్చిన శ్రీ, శ్రీ, శ్రీ జయపురంమహారాజా శ్రీవిక్రమదేవ వర్మగారికిని ప్రస్తుతాంధ్ర విశ్వవిద్యాలయ పరిపాలనాధి కారులగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారికిని, కీర్తిశేషులైన శ్రీమల్లాది విశ్వనాథకవిరాజు గారికిని, నాహృదయపూర్వకవందనములు.

మఱియు నాయట్టి సామాన్యకర్షక కవిచే తెనిగింపబడి మూలబడియున్న గ్రంథమును ఈనిర్బంధన (కంట్రోలు) దినములలో పుస్తకముచ్ఛాపించి పాఠకలోకమునకందించుటకును, నాచిరకాలవాంఛితము నెరవేర్చుటకును సంపూర్ణసహాయ మొనర్చిన శ్రీ సేనాపతి సీతారామ పాత్రుడుగారి వంటిపెద్దల కెంతయుకృతజ్ఞుడను.

శ్రీ పాత్రుడుగారు సామాన్య వ్యవసాయ కుటుంబములో పుట్టి స్వశక్తివలన వ్యవసాయశాఖా డిప్యూటీడైరక్టరుగా ప్రభతో పనిచేసి తనయాధిపత్యమున రైతులోకోద్ధరణ మొనర్చి నాయట్టి సామాన్యకవిచే ఆంధ్రీకరింపబడిన యీ గ్రంథమును పదునాఱేండ్లనాటికైనా బూజుదులిపి మీయెదుట బెట్టుటకు నాకునెల్లవిధముల సహాయపడిన యుదారస్వభావులు.

వారికి శ్రీమదక్షర పరబ్రహ్మస్వరూపదైవమే ధ్యేయాకారముగా వెలింగి సర్వార్థములందుఁబడి కృపలో రక్షించుఁగాత.

ఇట్లు

విధేయుడు

మురిచెర్ల జగన్నాథనాయుడు.

## ANDHRA UNIVERSITY.

*From* **WALTAIR**

సర్ సి. ఆర్. రెడ్డి, *Kt* **Date 15-11-1946.**

వైస్ చాన్సెలర్.

అయ్యా!

మీరు కాళిదాసుని రఘువంశమునకు చేసిన ఆంధ్రకృతము చాలా బాగుగనే ఉన్నది. మీరు చదివి వినిపించిన పద్యములను విని చాల సంతసించితిని, మీరు కోరినట్లు దీనిని విద్యాశాలలలో పఠనీయ గ్రంథముగ నియమించిన యెడల బాగుగనే ఉండును.

ఎట్లును అర్హమైనది.

ఇట్లు,

విధేయుడు.

(*SD*) క. రామలింగారెడ్డి

మరిచెర్ల జగన్నాథనాయుడుగారికి,
లఖణాపురము,

Nagur P. O
Parvatipuram Taluk
Vizag Dt.



**MAHARAJAH**
**OF**
***JEYPORE***

***FORT***
***Jeypore. [Orissa]***
౨౦-౧౨-౪౬

# ఆశయము



శ్రీ మరిచెర్ల జగన్నాథనాయుడు గారనువదించిన రఘువంశకావ్యముయొక్క పంచమసర్గమందలి కొన్ని పద్యములను వింటిని.

అవి మూలానుసరణములుగ, లలితపదయుతములునై యొప్పుచున్నవి. అచిరాత్తము సాకల్యపుస్తకము కావలయునని కోరు కవిగారికోర్కె నెఱవేఱుంగాక!

ఇట్లు,
*(SD)* శ్రీ విక్రమదేవవర్మ.



**KUSUMHARA**

**Viswandha Kaviraj**

VIZIANAGARAM

**Camp** విజయనగరం

Date 23—12—46

శ్రీ మరిచెర్ల జగన్నాథనాయుడుగా రాంధ్రీకరించిన రఘువంశ గ్రంథములో రెండువందల పద్యములు వారు చదువగా నేను వింటిని. ఇంతకుమున్న రఘువంశానువాదము లెన్నైన తెనుగున ప్రచారములో నున్నవి. కాని, యిందొక విశిష్టతగన్పట్టు చున్నది. ఆంధ్రీకరణ పద్ధతిలో మాటకు మాట సరిపెట్టి వ్రాయుట యొకటి. ఇది ఆధునిక యుగమున మిక్కిలి ప్రచారములో నున్నది. నన్నయ తిక్కన శ్రీనాథులు మనపూర్వు లేర్పఱచు మార్గమువేఱు. శ్లోకభావ మేమాత్రము విడువకుండ వీలైన నౌచిత్యము పెంపొందించి శ్రావ్యతకు ప్రాధాన్యత నొసంగి పద్యమును కావ్యమునుకూడ స్వాతంత్ర్య విలసితమగునట్లు నిర్మించుట. శ్రీ జగన్నాథనాయుడుగారు యీమార్గమవలంబించుటచే కావ్యమునకు శ్రావ్యత హెచ్చినది.

సహజముగా ఆయన కవితాధోరణి నిర్దుష్టమై మృదు మధురమై తెనుగుదనములో జిప్పిలుచుండును. ఇట్టి రచనలు తెనుగులో అరుదనియే చెప్పవచ్చును. శ్రీ నాయుడుగారు అచిరకాలములోనే యీ కావ్యమును సంపూర్ణముగ ముద్రింతురనియు మఱియు నీకావ్యము ఆంధ్రవిద్యార్థుల యొక్కయు పండితులయొక్కయు జనసామాన్యము యొక్కయు కరకమలముల నలంకరించుగాకయని హృదయపూర్వకముగ నభిలషించుచున్నాను—స్వస్తి

(*SD*) శ్రీ విశ్వనాథకవిరాజు.



శ్రీ విరాట్పరబ్రహ్మణే నమః.

శ్రీరస్తు.

మత్ప్రియ శిష్యులగు మరిచెర్ల జగన్నాథనాయుడుగారూ!

మీచే దెనుగింపబడిన "రఘువంశపద్యకావ్యము" సలక్షణమై మృదుమధుర పద భూయిష్ఠమై యాదికావ్యమునకు వన్నె బెట్టిన దగుటచేఁ బండిత జనాదరణీయమై, విద్యాభ్యసన జనపఠనీయమై ప్రభు సమ్మాననీయమై, యశోమూలమై గౌరవప్రదమై విరాజిల్లు గావుత మని శ్రీమత్పరు ననిశము ప్రార్థించుచున్నాడను—శ్రీ శ్రీ శ్రీ.

ఇట్లు,

ప్రౌఢసరస్వతి: స్మార్తసింహ: విబుధజన విధేయ

(SD) చేవూరి వేంకటసోమసుందరశాస్త్రి

పెదపెంకి గ్రామము.

ది. 17—1—47
పెదపెంకి

బొబ్బిలి తాలూకా

విశాఖపట్టణము జిల్లా.



—♦ సత్పురుషులదయకు తన్నుపాత్రునిగఁ జేయుటను
జెప్పుకొని కవి సరస్వతికి నతిఁజేయుచున్నాఁడు. ♦—

సీ. శ్రీ జయపూర్మహారాజ విక్రమదేవ
వర్మ రాడ్దివ్యసేవనము లొసఁగి
సర్, కట్టమంచి వంశలలాము రామలిం
గారెడ్డి సత్కృపాసార మునిచి
రావుబహద్దరు శ్రీవి సేనాపతి
వంశ్యు సీతారామపాత్రుఁడనిపి
కవిరాజు బిరుదుసంగతవక్తృ మల్లాది
విశ్వనాథసుశర్మ వేడ్కనెఱపి
తే. యెటుల సద్రమాప్పదోద్యోగ మొనయుబుధుల
వక్తృజనుల మనస్సరోవరవిహార
కలన నను ధీరకలహంస కరణి నిడిన
నీకు మ్రొక్కెద నమ్మ యాంధ్రైకవాణి. 1

—♦ కవి తనబంధువులతో ప్రస్తావనఁజేసి చెప్పు మాట ♦—

మ. భవితవ్యంబగుభాగ్యమెద్ది ధనులై పాటింప లే రెద్దియో
భువి రాజ్యస్థిరలక్ష్మియెద్ది పతులై భోగింప లే రెద్దియో
నివసద్బంధురగంధి యెద్ది రతులై నేరంగ లే రెద్ది యా
కవితాకన్యక హస్తచుంబనము తాఁ గావించె నాచెక్కిలిన్. 2

ఉ. అప్పు గొనన్ మొగుళ్ళకు మహార్ణవమట్టులె గారె మీరు నా
కిప్పుడు మీసమృద్ధియెయి నెట్లును బాల్పడ నర్హుఁడంజుమీ
యొప్పుగ నీకృతిన్ రఘుమహోదయమందు రసోదయంబుగాఁ
జెప్పితి నేను సరధనిశేషులు గా రొకొ మీర లెప్పుడున్. 3

—♦ ఆశీర్వాద పూర్వకముగా కవి తనకవశ్యపురుషులగువారిని
చెప్పుకొను చున్నాడు ♦—

తే. కోటవారి వంశకోటికిఁ గోటీర
మఖిల వైభవంబు లతఁడె నాకుఁ
బ్రబిమ లొప్పుఁ డప్పలస్వామినాయకుం
డతని జన్మ సఫల మగునుగాత. 4

తే. అలఘు లక్షణాపుర గృహాఖ్యఁ జెలఁగి నాహిం
తముఁ గరణికము రాజపూజ్యముగ నడిపి
ప్రజల శ్రేయోభిలాషకుఁ బాత్రమయిన
సుగుణి నరసింహు హరిభక్తి నెగడు గాత 5

తే. వైష్ణవోల్లాసి యోగవిభాసి యోగి
రెడ్డి రామాఖ్యుఁ డాతనిప్రేమ నాకుఁ
గలుఁగు ప్రజ్ఞానబుద్ధిసంకల్పహేతు
వగుట నాతఁడు నాకు సత్యార్థ మగుత. 6

తే. సాళకుఁడు నాకు సన్మాన్య శీలధనము
శాంతరసపూర్ణకలశఁబు సకలురందు
భద్రగుణి ఘంటవంశపూర్వాద్రితరణి
గౌరునాయకుఁ డతఁడు ప్రఖ్యాతమగుత. 7



—♦ స్వ వి ష య ము ♦—

తే. శార్ఙ్గికై ళ్ళోల్ల భక్తరఘామణి యని
మఱల వైష్ణవ శైవ సమ్మతముతోడ
శ్రద్ధఁ గౌస్తుభరాజభూషణ మనంగ
శతకములు రెండు చెప్పితి సరసముగను. 8



శ్రీ పరబ్రహ్మణేనమః.

# ఆంధ్రరఘువంశ మహాకావ్యము



## ప్రథమ సర్గము

—♦ ఇష్టదేవతా ప్రార్థనము. ♦—

శ్రీ దైవత్రయ మూర్తిమంతము మహాచిత్ర ప్రభావంతమున్
వేదవ్యాసమహర్షి నిర్మితమహావేద స్ఫుటాదర్శ దృ
క్పాదచ్ఛాయము మమ్ముఁ బ్రోచుతఁ బరబ్రహ్మంబు సర్వాత్మ ని
ర్మాదంబుం జిరమోదమున్ ఋత మనిర్వాచ్యం బమోఘంబుగాన్.

—♦ కాళీస్తుతులు ♦—

శా. ఆర్తుల్ బోవిడఁ గోరువారికి మహైశ్వర్యముల్ కీర్తి స
ద్వార్తల్ గోరినవారికిం బ్రబలసౌందర్యాది వైశేష్య సం
పూర్తుల్ గోరినవారికిన్ నిఖిల సద్బుద్ధుల్ సువిద్యాదిక
స్ఫూర్తుల్ గోరినవారి కెల్ల నవియొప్పుంజేర్చుఁ గాళీస్తుతుల్. 2

—♦ విఘ్నేశ్వర స్తవము ♦—

ఉ. చిత్రము లెవ్వి సన్మునులచిత్తములం బ్రకటింప వానిచా
రిత్రము లౌనటంచు విపరీతముగాఁ బ్రకటింతు నాతనిం
గాత్రవరద్యుతి భ్రమిత కైరవశత్రుని హైమగోత్ర దౌ
హిత్రుని శూలిపుత్రుని మహీధర జాస్యపయోజమిత్రునిన్. 3

శా. విఘ్నాద్రీశ్వరు మోదసంభృతవచో విభ్రాంత భూతేశ్వరున్
విఘ్నత్మాధర దారుణస్వరు మహావిద్యా తమోహస్కరున్
విఘ్నోర్వీంధన బర్హి నర్హముగ మద్విఖ్యాతసత్కావ్య ని
ర్విఘ్నవ్యాప్తికిఁ బ్రస్తుతింతు నిరతిన్ విద్వన్నుతుం ధీయుతున్. 4

—♦ సరస్వతీ స్తవము ♦—

ఉ. పుస్తముఁ గేలుదోయి ధృతిఁ బూనితిమేలు దలంపవమ్మ ప్రా
ద్యస్తము నాదు బ్రోలఁ గడు నాస్థ మెలంగి చెలంగవమ్మ ప
ర్యస్తవచస్సముత్కరము నాస్త్రియనం గఱపింపవమ్మ సం
శస్తకరంబునాఁ దగు సమస్తవచోత్కర మిమ్ము భారతీ. 5

శా. తల్లీ భాగ్యవతీమతల్లి విలసద్దంత చ్ఛటాహూత స
న్మల్లీ భూమి నభోంతరావృతలసన్మందార కీర్తి ప్రభా
వల్లీ నిర్జితమోహవల్లి తనుశోభా హ్రీత సౌదామినీ
వల్లీ సజ్జనకల్పవల్లి వలతున్ వాగ్వైభవం బీయవే. 6

ఉ. పాణియుగంబుమోడ్చి పరిపాటిగ నెన్నదురంట మ్రొక్కెదన్
శోణపద ప్రభారమకు శోకవిరామకు సర్పరాజ ని
ర్మాణ జటాభిరామకు సమస్తరసస్ఫుట వాగ్విలాస కుం
భ్రాణి ముఖప్రవాసకు విలాసకదంబకు శారదాంబకున్. 7

మ. కుధరశ్రోణికి వాణికిన్ నతదివౌకో భూజనశ్రేణికిం
బృథుమంజు ప్రతిభానిభాంగికి నిజావిర్భూతవాగ్భంగికిం
బధిరీ భూతజన శ్రవోమిథునముల్ బహ్వర్థ సంధానముల్
బుధసంవాద నిధానముల్ వచనముల్ పొల్పొందఁ జేమోడ్చెదన్. 8

శా. వల్మీకోద్భవు నారదున్ నిజకుచద్వంద్వాంతరక్షీరముల్
తాల్మిన్ మట్టుగఁ బంచిపెట్టి త్రిజగత్ప్రఖ్యాత విద్యానిరూ
ఢుల్మూర్తి ప్రతిభానిరూఢ విజితోడుద్యోమణుల్ ధీమణుల్
తాల్మిం భూసము లర్మిలిం బ్రియులుఁగాఁదాఁ జేసెఁగొల్చెదన్. 9

ఉ. ఆకమనీయ రామకథ నావలి నాగమసంవిభాగముం
దీకొని మున్నొనర్చి సముదీర్ణ యశోర్ణవ కేళిఁ దేలి భా
షాకృతిమత్త్వముం జతురసాధ్యగతిన్, వెడలించినట్టి వా
ల్మీకి పరాశరాత్మజుల మేలుఁదలంచి భజింతు నిచ్చలున్. 10

తే. కాళిదాసమయూరమాఘ ప్రముఖుల
ఘటిత సంస్కృతకావ్య విఖ్యాతయశుల
దోషరహితుల మేధావిశేషులను స
రస్వతీర్థావతార వర్ణనులఁ దలఁతు. 11

ఉ. భారతమందు మూఁడుదొగిపర్వములన్ మృదుఫక్కిఁగా మహా
సారకవిత్వమాధురిఁ బ్రసక్తి జగంబులు గ్రోలఁ జెప్పి భా
షారచనీయమార్గమనుశాస్త్రియొనర్చి కలావిభుండు నా
వారక సత్ప్రసిద్ధిఁగనువానిఁ దలంచెద నన్నపార్యునిన్. 12

ఉ. ఒక్కఁడనైనవాగ్విభవ మొక్కకొంతయు లేక యొక్కఁడుం
జక్కెర మాడ్కి మాధురికిఁ జక్కియనంగ రసప్రసారమిం
పెక్కఁగ భారతంబునను బెట్టిదమైన పదేను పర్వముల్
చక్కఁరచించె నే ద్రుహిణసన్నిభుఁ డాతనిఁ గొల్తుఁ దిక్కనన్. 13

క. అకలంక కృతులనొసరిచి
ప్రకటితఘన యశులుఁగాఁగ బ్రకటముగొను నా
సుకవుల నెఱ్ఱాప్రెగడను
నిఁకనాచనసోమునాత్మ నెంతుసతంబున్. 14

ఉ. పారము ముట్ట శ్రీహరికి భాగవతంబును భక్తిచాతురీ
గౌరవ సౌష్ఠవంబులును గర్ణరసాయనసాధు మాధురీ
ధోరణి పాటవంబులుఁ గుదుర్పడఁ జెప్పి ప్రబంధ కర్తయై
భూరియశంబుఁ గొన్న యలపోతనసత్కవి సన్నుతించెదన్. 15

క. పెక్కులగు తెనుఁగు కబ్బము
లక్కజముగఁ జెప్పి శాశ్వతార్జితయశులై
చక్కఁబడు నితరకవులకు
నొక్కొకని కొనర్తు జోత లొనరఁగ నూఱుల్ 16

ఉ. వాకునఁ జేతనున్ సరసవాగ్రచనల్ పొసఁగించుచోట న
వ్యాకృతమైన తప్పులు నిజార్థములంచు గణింపరాదు నే
నీకృతి మీకృపం జలుపు నిచ్చమెయిం బురికొల్పుకొంటి మి
మ్మాకసమందు నీలిమ యథార్థముగామి నెఱుంగరే ఘనుల్. 17

చ. వెనుక నొనర్చునట్టి యపవిత్ర వపుష్కలుషంబు లెల్ల న
త్యనవరతాది కావ్యరచనాహతి సాహితిఁ గానవచ్చు నే
స్వనితసువృష్టికోపలలు శాతశిలావృతశైలపాత ధం
ధణితములై దివాకర కనత్కిరణంబుల నింకునట్లుగాన్. 18

ఉ. నేరుపెలర్పమై నగణనీయ మహావిభవాభివర్ణనల్
సూరినతంస శబ్దపరిశుద్ధి మహత్తర సృష్టిఁ గల్గి యొ
ప్పారెడి కాళిదాసకృతి యద్దిరచింపఁగఁ బోలరాదు వి
ద్యారమ కొప్పిదంబుగను దాదృశలీల వచించుబుద్ధిచేన్. 19

చ. శుకపికరావముల్ వినఁగ శ్రోత్రసుఖంబు లటందు రందులోఁ
బికనికరారవంబు లలివేడుక రూపమసహ్యమన్నటుల్
సకలకుశబ్దరూపము లసహ్యములైన రఘుప్రవీర సా
ర్థకమతవీర్యవృత్తములు శ్రావ్యతమంబులుగావె చూడఁగన్. 20

క. కాళీముఖ నాళీక ము
హాళిం దర్శించు భాగ్య మబ్బఁ గఁ బదరిం
ఛోళి విహారము సలుపఁగఁ
గాళీదాసునకు నయ్యెఁ గాక మఱొండే. 21

క. కాళీప్రసన్నుఁ డగుటను
గాళీదాసుండునాఁగ గణుతింగనె శ
ద్బాళి విహారము సలుపఁగ
హాళిమఱొక్కనికిఁ గలదె యారసి చూడన్ 22

తే. ఇమ్మహా కవి తా రచి యించు నట్టి
కావ్యసంసర్గముఁదెలిసి శ్రావ్యముగను
దెనుఁగు కబ్బంబు సెప్పంగఁ దేఁకువరయ
సైకమగుఁగాక నానేర్చుచంద మెంత. 23

సీ. బహుకర్మసంభూత భవసాగరము లెండ
బడబాగ్ని రఘువంశ భవ్యకావ్య
మతిబంధురస్పందగతి బంధరతు లోడ
బయలేఱు రఘువంశ భవ్యకావ్య
మభినవసౌభాగ్య శుభజని శ్రీగల్గఁ
బాధోధి రఘువంశ భవ్యకావ్య
మఘసంఘ నిర్మూల నాముక్తగతు లొంద
భద్రాద్రి రఘువంశ భవ్యకావ్య

తే. మనుచు నెదలోనఁ దలపోసి ఘనత మెఱసి
ఘనసుకవుల కృపాక టాక్షంబు వడసి
సాహసంబువహించితి సరగదీని
నాంధ్రభా షాకృతిని జెప్ప నభిలషించి. 24

—♦ భాషావస్థ ♦—

క. తెలుఁగుపస నిరసనంబయెఁ
దెలుఁగున విద్యావి వేక దీధితిమాసెన్
నిలువెల్లగ్రస్తమయ్యెడి
నెలభాతి సవోపరాగ నిర్ణయమొక్కో. 25

క. కొఱమాలిన కవితల్ తగి
కఱవాయె ప్రబంధకవిత కదయిప్పటిలోఁ
గొఱగాదు కావ్యపరిణతి
పఱబా సెరవగుచుమతికిఁ బట్టుటచేతన్. 26

—♦ కవితాప్రశంస ♦—

సీ. శుంభత్ప్రయోరసారంభస్వారాటన
స్తంభనంబులు వచోగుంభనములు
సారభారత్యలంకార భావనములు
సురుచిరాలంకార శోభనములు
నజస్సృష్టివద్వివిధారంభణములు సు
స్థిరకథాకల్పనాజృంభణములు
పరమప్రభావసంపత్తి రక్షణములు
లలితార్థపదభావలక్షణములు
తే. ప్రకట గౌరవ సౌష్ఠవ పాటవములు
వెలయఁ గవులకు వలసిన విధముగాఁగఁ
గావ్యసౌభాగ్యములె సహకారులగుటఁ
దెలిసి కావ్యంబు సెప్పుట తేకువరయు.

శా. శ్లోకం బట్టులె పద్యగద్యలు కథారూపంబులం భావరీ
త్యాకూతంబుల సారసార్థముల సమ్యక్సామ్య రూపాదులం
దీకావ్యం బనురూపమై చనఁగ నావృత్తాదులన్ బాఠకుల్
శ్లోకాంశంబుగ. నభ్యసించుటకు నాచోప్పేదకే చెప్పుదున్. .28

—♦ గురుస్తుతి ♦—

క. భవ్యుఁడు లక్ష్మణాపుర వా
స్తవ్యాఖ్యుఁడు శైశవమునఁ జాగించెను నా

కవ్యక్తాక్షరపంక్తిని
నవ్యాస్థ నుతింతు సూర్యనారాయణునిన్. 29

మ. తలఁతుం జేపురివంశవారిధి సుధాధాముఁన్ మహజ్ఞాన ని
ర్మలఖద్యోతగభస్తిని న్రిర్జితతమున్ మందార నీహార స
త్కలహంసాభ్రవిశుద్ధకీర్తి నురుభాస్వన్మూర్తినిం జిత్తని
శ్చలతన్ వేంకట సోమసుందరుని నస్మత్కీర్తిమందారునిన్. 30

సీ. విశ్వకర్మ విధాన విస్తార కర్మ ప్ర
భావ విజ్ఞాన సంపత్తిఁ గలఁడు
వివిధ శాస్త్ర జ్ఞాన విశ్వతోముఖములఁ
బురుషోత్తమాంశ విభూతిఁ గలఁడు
ప్రజ్ఞానకల్ప ప్రభాసృష్టి శక్తుల
బ్రహ్మానుభూతి సంప్రాప్తిఁ గలఁడు
తీవ్రదయారస దృష్టి ప్రసాదనై
ఖరుల భూతేశ్వరఖ్యాతిఁ గలఁడు

తే. విశ్వకర్మ కులార్ణవ ప్రీతినైన
స్వజని చంద్రోదయాప్తి పుష్కలతఁ గలఁడు
యలరు చేపూరివంశ పూర్వాద్రి వెలుఁగు
భాస్కరుఁడు సోమసుందరస్వామి గురుఁడు. 31

—♦ కవివంశానుక్రమణిక ♦—

క. శ్రీమన్మరి చెర్లకుల
శ్రీ మహిమా విలస నాభి శీలుఁ డుదారుం
డౌ మత్ప్రపితామహుఁ డధి
కామలుఁ డగు గౌరునాయ కాఖ్యుఁ డతనికిన్. 32

క. భూనుతుఁడు పోలనాయకుఁ
డానతగుణయుతుఁడు గల్గె నాతం డల ధ

ర్మాను సరణి మెఱుఁగుచు నుజీ
వోనివి యగు ధర్మములను బొనరించుఁ దగన్. 33

సీ. నిఱుపేదలకుఁ గాఁగ నెఱియిచ్చి యర్థంబు
గడియించు నాతని గడన గడన
గురు సాధువులఁ గూర్చి కురియించి యర్థంబు
గుడిచిన యాతని కుడుపు కుడుపు
పితృ తర్పణములందు వెచ్చించి యర్థంబు
మురియించు నాతని మురువు మురువు
సమయంబు లందెల్ల సమయించి యర్థంబు
బ్రతికించు నాతని బ్రతుకు బ్రతుకు
తే. యంగహీనుల గోల చల్లార్పఁగాఁగ
శరణితులఁ జేయు నాతని శరణు శరణు
స్వజనులకు లేమియెడను నాశ్రయులఁ జేసి
సరణికిని దెచ్చు నాతని సరణి సరణి. 34

వ. అని యిట్లు గురు సాధు నిర్ధనాదులయందు భక్తి ప్రియాదరం
బులు నెఱపుచు నాతండు ధర్మ ప్రవర్త నానురక్తుండు నా
వెలసె. 35

తే. పోల నాయక నాముని పొట్ట పంట
యన శివున్నాయకుండు లక్ష్మనయుఁ బాపి
నాయకుండును మఱిగౌరు నాయకుండు
ననఁగ నల్వురు వెలసిరి యనుజ వరులు. 36

క. నిక్కముగ స్వార్థమందున
నక్కఱ గల్గినను జేయ నరుఁగరు పరులన్
నొక్కు పఱచు పనులను దా
మక్కజముగఁ బరహితార్థ మక్కఱఁ గొనుటన్. 37

శ్లో. సవేలా (30)

శా. వేలాకూలము వప్రముల్ పరిఖ లుద్వేలాంబుధుల్ నిర్ద్విష
త్ఖేల వృత్తములై తగంగ దివి ధాకీర్ణంబులై శాసనా
భీలా స్థాపనముల్ ఘటిల్లఁగ సముద్భిన్నేత రాజ్ఞస్థిగాఁ
బాలించెం భువి నొక్క ప్రోలుగఁ బ్రభావస్ఫూర్తి వర్తిల్లఁగాన్.72

—♦ దిలీపునికి సుదక్షిణ భార్యయగుట ♦—

శ్లో. తస్యదా (31) శ్లో. కళత్ర (32) శ్లో. తస్యామా (33)

సీ. మగధేశ కులజాత మానవతీరత్న
మఖిలదాక్షిణ్య శీలాదిగుణము
లలరంగ నధ్వర ములకు దక్షిణవోలె
నమరుదాని సుదక్షిణాఖ్య వెలఁదిఁ
బరిణయంబై యేకపత్నీ వ్రతుండయి
నిజరాజ్యలక్ష్మియు నెనరు సతియు
నిఖిలవైభవములు నిండారఁ దనుపంగ
శోభనస్ఫూర్తుల సొబఁగుఁ గాంచి

తే. భద్రగుండైన యాదిలీప ప్రభుండు
తనకు ననురూప మైనట్టి తనదు భార్య
యందు సత్పుత్రుఁబడయంగ నభిలషించి
కొంతకాలంబు సైరించి యంతమీఁద. 73

—♦ దిలీపుఁడు మంత్రులయందు భూభారముంచుట ♦—

శ్లో. సంతానా (34)

క. సంతానార్థము యొకవిధి
స్వాంతంబునఁ గదురఁ జేసి యవనీ రాజ్యం
బంతయు సచివులపై నిడి
యంతట శుచులగుచు నింతి యతఁడు నిజేచ్ఛన్. 74

—♦ వారిగమన కాలములో ఏకరథారోహణము మొదలుగాఁగల
గుణముల వర్ణించుట ♦—

శ్లో. అథభ్య (35)

ఆ. అల విరించి గూర్చి యఘములార్చి స్మరించి
యులవరించి భక్తి నిలువరించి
నిష్ఠఁ బూజలుంచి నిజగురు నాశ్రమం
బునకు వెడలసాగి రెనసి మొనసి. 75

శ్లో. స్నిగ్ధగం (36) శ్లో. మాభూదా (37)

వ. అటుల నారాజదంపతులు ప్రయాణావసరంబున రథారోహ
ణంబు సేసి 76

సీ. మెఱుపును జౌదంతి మేటి నీలఘనంబు
పైని దోతెంచెడి భంగిలోప
స్నిగ్ధగంభీరనిశ్శేష నిర్ఘోష ల
వారితంబులుగాఁగఁ బాఱుతెంచు
కఱకాంతు లలరెడి కమ్రంది రథంబుపై
ధవళవర్ణుఁడు ధరాతల విభుండు
మేల్మి బంగరుచాయ మేనొప్పు సతియును
దరలిపోవుచు నిజగురుని కెంత
తే. శ్రమము దోపకయుండెడి క్రమతఁ గూర్చు
తన కొఱం తగుసేన చేతనములకును
సహజ తేజో విశేషోత్క మహిమ వలన
నలవుఁ గలయట్టి దగు భంగి వెలయఁ జేయు. 77

శ్లో. సేవ్యమా (38) శ్లో. (39) (40) (41) (42) (43) (44) శ్లో.
హైయంగ (45)

వ. మఱియును సుఖస్పర్శంబును సాలతరుస్వరస పరిమళమిళితంబును విక్షేపిత కుసుమ పరాగంబును సంస్పందిత వనసందోహంబునునై వీతెంచు మందమారుతంబు మేన సోక నానంద మొందుచు రథవేగంబు చేతంబుట్టిన నేమి స్వనంబులు మేఘనినాదంబులని తలంచి యేతెంచు మయూరంబుల కేకారవంబులు మనోభిరామంబుగను షడ్జస్వర సమానంబుగను వినంబడుచుండ శ్రవణంబు సేయుచుఁ దమపోయెడి మార్గంబునకు సమీపంబునందుండి రథావలోకనంబు సేయుచున్న మృగ మిథునంబులయుఁ దమయు నేత్రసాదృశ్యంబుఁ బరీక్షించుచు నొండుయెడ స్తంభరహితంబైన బహిర్ద్వారంబునం గట్టెడు స్రక్శ్రేణి కరణి వరుస నెగసి కలకలంబు సేయుచుఁ బోవు సారసపక్షులఁ దలలెత్తి వీక్షించుచు నభీష్టార్థసిద్ధిఁ బడయు చందంబ యనుకూలత్వంబు వహించి వీతెంచు తెమ్మెరలచేతఁ దురగఖురోత్కీర్ణరజంబు నిజాల కావేష్టనంబులకు స్పృశ్యమానంబు గాకయుండఁ బోసంగుచు నరిఁగెడి మార్గంబులోని కొలంకువుల భంగసంక్షోభ శీతలంబైన యరవిందామోదంబు స్వనిశ్వాసంబు ననుకరించుచుండ నాఘ్రాణించుచు నాఁడు క్రతునిమిత్తంబుగఁ దనచేత విసృష్టంబైన యూపంబుల చిహ్నంబుగాఁ గలట్టి యాత్మదత్త గ్రామంబులందు యజ్వలొసఁగు నర్ఘ్యపాద్యంబు లాశీర్వాదంబు లందుకొనుచు నెదుర సద్యోఘృతంబుఁ జేకొని వచ్చుచున్న ఘోషవృద్ధుల వనంబులోని పార్శ్వవృక్షంబుల పేళ్ళడుఁగుచుఁ దెరువునఁ బసిపోవుచుండు నప్పుడు— 78

శ్లో. కాప్యభి (46)

ఉ. హేమముఁపుఁబోక పిమ్మటను హెచ్చగు శోభను దెల్గునట్టి చి
త్రామృతదీధితుల్ గతి సుదంచిత వేషులు నాను దక్షిణా

భామ దిలీపు లిద్దఱు విభాసిలి రంత బుధోపముండు దాఁ
బ్రేమ విలోకనుండగుచుఁ గ్రేవలతత్త్వ దశేష దృశ్యముల్. 79

—♦ సుదక్షిణా దిలీపులు వసిష్ఠాశ్రమమును పొందుట
ఆశ్రమమును వర్ణించుట, రథమునుండి దిగుట ♦—

శ్లో. తత్త్వద్భ్యా (47)

క. అరయుచుఁ గాంతకుఁ జూపుచు
వెరవుగ నొండొరుల వేడ్క వెంపొదఁవగ, దా
మరిఁగెడి తెరు వెటుగడచిరో
గురు తెఱుకయె లేక ప్రొద్దు గ్రుంకెడుతఱికిన్. 80

శ్లో. సవృత్రిష్వా (48) (49) (50) (51) (52) (53) శ్లో. అథయం (54)

తే. దూరగమన ప్రయాసంబు దొరయు కతనఁ
గరము బడలికఁ గొను తురంగములతోడ
నన్యదుర్లభమైనట్టి యధిక యశుఁడు
మేదినీశుండు పత్నీసమేతముగను. 81

వ. వనాంతరంబుల నుండి సమిత్కుశఫలంబులు గొనివచ్చువారును దృశ్యంబు గాని యగ్నిత్రయంబువలనఁ బ్రత్యుద్గతులైన ఋషుల చేతఁ బూరితంబైనట్టియు తృణధాన్యంబులఁ దినుచు ఋషి భార్యలబిడ్డలవలె నుటజద్వారంబుల కడ్డంబుగనుండు మృగం బులచేత వ్యాప్తంబైనట్టియు మునికన్యలు వృక్షసేచనంబు సేసి పక్షులు తదీయాలవాలంబులలోని నీళ్లుపానంబు సేయ వలయు ననెడి విశ్వాసంబుతోడఁ దత్క్షణంబ తమచేత విడువంబడిన వృక్షకంబులు గలట్టియు యెండమార్పడి యెడు వేళఁ ద్రోసి ప్రోవు పెట్టెడు తృణధాన్యంబులఁ జేర్పంబడెడు నుట జాంగ ణంబు లందు నెమరువేయుచుఁ బరుండు జింకలుగలట్టియు ప్రజ్వలితంబైన త్రేతాగ్నులకు సూచకంబులై పవనోద్ధూతం బులై ధూమాహుతి గంధ మిళితంబులైన ధూమంబులచేత నాశ్ర

మాగత జనంబులకుఁ బవిత్రంబుసేయు చున్నట్టిది యగు నవ్వ
సిష్ఠాశ్రమంబుసేరి రథంబునుండి పడఁతిం డింపి తాను డిగి
యశ్వంబులకు సేదఁదీర్చుమని సారథి కాజ్ఞ యిచ్చెఁ దద
నంతరంబ. 82

—♦ వారికి ఋషి సమూహము పూజసేయుట వసిష్ఠుని జూచుట
అరుంధతీ వసిష్ఠులకు నమస్కరించి వారి యాశీర్వాదమును పొందుట♦—

శ్లో. తస్మైస (55) శ్లో. విధేస్నా (56) శ్లో. తయోర్జ (57)

సీ. ఘనశాస్త్ర దృష్టియుఁ గలవాఁడు రక్షకుం
డౌటఁజేసియు నతం డర్హముగను
నతి నియతేంద్రియు లై సభాసదులైన
ఋషులచేత సతీపరి వృతముగను
బూజితుండై పతి ప్రొద్దుపోయెడువేళ
సకలవిద్యావసాన సమయమందు
స్వాహాచే హుతభుజు వలె నరుంధతిచేతను
పాసితుండైన తాపసు వసిష్ఠుఁ
తే. గాంచి తానును సతి నమ్ర గాత్రులగుచు
వాలి గురు పత్నులయు పదగ్రహణ మొనరఁ
జేయ వారును ప్రీతి నాశీర్వదించి
రెంతయు సగౌరవముగఁ గొలంతసేక 83

—♦ వసిష్ఠుఁడు కుశల మడుఁగుట, దిలీపుడు వసిష్ఠునికిఁ
దన క్షేమమును దెలుపుట ♦—

శ్లో. తమాతి (58) శ్లో. అథాధ (59)

ఉ. ఆ భువనేశు నమ్మునియు నాదర మొప్పఁగ నాతిథేయ స
ద్వైభవ సత్క్రియాచరణ సత్కృతుఁజేసి కరంబుమై రథ
క్షోభ పరిశ్రమం బుడిపి సూక్తిని దాఁ గుశలంబె యంచనన్
శోభితనైజ రాజ్యపరిశుద్ధ సమాశ్రమ మానియుం దగన్. 84

తే. అర్థపతియును గడువ క్త్వయగుట నెంత
యును వెరవుఁ గలిఁగి తనను యుక్తిఁ దెలుప
నల యథర్వణవేది ముంగలను నిట్టు
లను బ్రయోజనమును గరం బనునయింప 85

శ్లో. ఉపప (60)

ఉ. రంగుగ రాజమంత్రి హిత రాష్ట్ర చయాదికమైన నాదు రా
జ్యాంగ మదెల్లయుం గుశల మంతకు దైవిక మానుషంబులన్
సంగతమౌచు నాకు నవశంబుగ వచ్చెడి యాపదల్ నివృ
త్తింగనఁ జేయఁ దారును బ్రతిక్రియ దక్షులు గారె యారయన్. 86

—♦ వసిష్ఠుని మాహాత్మ్యమును వర్ణించుట ♦—

శ్లో. తవమం (61)

ఉ. నా శరముల్ పరోక్షమున నాశ మొనర్పఁగ లేవు శత్రులం
గౌశల దృక్ప్రసారములఁగాక మహాద్భుత శక్తి సంపదా
వేశుల రిద్ధమంత్రచయ వేత్తలకాట భవన్మహా ప్రశ
స్తాశయ మంత్రజాల మపహం బొనరించుఁ బరోక్షమందునున్ 87

శ్లో. హవిరా (62)

ఉ. హోతలరైన తారు సుమహోన్నత శాస్త్ర విధి క్రమంబుగాఁ
బూతమహాగ్ని హోత్రముల భూరిహవిస్సులు నిండఁ జేసి ని
ర్వాత సువృష్టినిం గురిసి వగ్రహపీడ లసారతంబు నెం
తో తడవాట్లకుం బొరయకుండఁగఁ జేయరె సస్యకోటికిన్. 88

శ్లో. పురుషా (63)

చ. పరిమితిలోడఁ బూరుషుల పట్టగు జీవితమైన నూఱు వ
త్సరములు మర్త్యజల్ బ్రతుకఁ జాలుదు రింకయు నీతిబాధలం
బొరయక యుందు రార్యవర పోఁడిగ మీ దగు సత్త్వ వృత్త సం
స్మరణ సమృద్ధియే నిరుపమానము మైతగు కారణంబుగాన్. 89

శ్లో. త్వ మేవం (64)

చ. అవని భవత్ప్రభావ మరయం గలవారమె బ్రహ్మవంశ సం
భవులరు మాకు సద్గురులు భద్రగుణాటను మీప్రభావమై
భవమున దుర్విపద్రహితభంగి నదేల చెలంగ వెమ్మెయిన్
వివిధ మదీయసంపదలు నెక్కసమై ననువీడకుండఁగన్ 90

—♦ దిలీపుఁడు తనకుఁబుత్రులు లేకపోయెనని చింతించుట ♦—

శ్లో. కింతువ (65)

ఉ. ఇమ్మగు దీవులుంగలిఁగి యిమ్మహి రత్నజనీన యయ్యు నా
కొమ్మగు నట్టిమీయనుఁగుఁగోడలు పట్టఁపుదేవియందు నా
కమ్మకు సాటియైన యొకకమ్మువహించిన పుత్రరత్నమాం
దమ్మగ నాకుఁగల్గమి ముదమ్మొనగూర్పఁగ జాలదెమ్మెయిన్ 91

శ్లో. నూనం మ (66) శ్లో. మత్పరం (67)

వ. అట్లు గావుననామనంబు సంతసింపదు మఱియు నాకుఁ బుత్రుం
డు లేనియెడ నాయనంతరంబు పిండప్రదానంబు సేయంగలవారు
లేరనుతలంపున మత్పితృదేవతలు తమకు భోజ్యంబైన స్వధయం
దాసక్తులైనను నియతంబైన శ్రార్ధసమయంబులందు నిత్యంబు
గాదని యథేష్టంబుగ భుజియింపంజాలకుందురు. తిలోదకంబు
లిచ్చెడివారు లేరని నిట్టూర్పులువిడుతురు. తదీయ నిశ్వాసేషదు
ష్ణంబులైన మదీయదత్తోదకంబులు గ్రహియింపకుందురు.

శ్లో. సోహమి (68)

మత్తకోకిల. ఏను యజ్ఞములాచరించి యహీనదేవఋణంబు నెం
తైనఁ దీర్చి కడున్ విశుద్ధుఁడనై ప్రకాశముగాంచి సం
తానహీనతఁ బైతృకంబునఁ దక్కియున్న ఋణంబుఁబెం
పూని తీర్పమి నప్రకాశత నుంటిఁ జుట్టుమలంబలెన్ 93

శ్లో. లోకాంత (69)

తే. తపము దానంబువలనను దనకుఁగలుఁగు
సుకృతమున నల్లపరలోక సుఖమె యొదవు
నుత్తమం బగువంశమందున్నత మగు
సంతతిని గన్న నిందందు జరుఁగు సుఖము 94

శ్లో. తయాహి (70)

చ. చలమున సృష్టిఁజేయఁ గలశక్తిగలారు ప్రియంబునాయెడం
జలిపెడివారు నాకుఁగలసంతతిలేమనిగూర్చి తారు నీ
రలవుగఁ బోసి యాశ్రమమునందునఁ బెంచినవృక్షకంబు తాఁ
బెలుచన గొడ్డుఁగోఁ బరితపించినయట్లు దపింప రేలకో 95

శ్లో. అసహ్య (71) శ్లో. తస్మాన్మ (72)

ఉ ఏను సహింప మజ్జనవిహీన మదద్విపమర్మభేద నా
లానముభంగి నాకతిభరం బగునట్టిబెడంద పైతృకం
బైన ఋణంబు యోవరగుణాఢ్య తదీయవిముక్తిఁజెంద నె
ద్దాన నుపాయమౌ నదియుఁ దప్పకఁ జేయవె మాకు సద్గ్రహా. 96

క. ఇక్ష్వాకు వంశ జాతుల
పక్షంబుగఁ గార్యసిద్ధిఁ బడయం జేయం
దక్షత నసాధ్యమైన న
పేక్షింతువు నీవుఁ జేయు ప్రేక్షను దండ్రీ. 97

—♦ దిలీపుని గూర్చి సంతానము లేకపోవుటకు హేతువును

శ్లో. ఇతివి (73) (74) (75) (76) శ్లో. అవజా (77)

వ. అని యిట్లు దిలీపుండు విన్నవింప విని వసిష్టుండు, నిద్రఁబోయెడి మత్స్యంబులు గల మడుంగు తెఱంగున సంచలనంబు నొందక యొక్క క్షణంబ నిమీలిత నేత్రుండై యేకాగ్ర చిత్తంబున నాత్మ భావనంబుచేసి యన్నరపతికి సంతానప్రాప్తి గాకుండుట

శ్లో. సవేలా (30)
శా. వేలాకూలము వప్రముల్ పరిఖ లుద్వేలాంబుధుల్ నిర్విప
క్షేల వృత్తములై తగంగ దివి ధాకీర్ణంబులై శాసనా
ఖిలా స్థాపనముల్ ఘటిల్లఁగ సముద్బిన్నైత రాజ్యస్థిగాఁ
బాలించెం భువి నొక్క ప్రోలుగఁ బ్రభావస్ఫూర్తి వర్తిల్లఁగాన్. 72

—♦ దిలీపునికి సుదక్షిణ భార్యయగుట ♦—

శ్లో. తస్యదా (31) శ్లో. కళత్ర (32) శ్లో. తస్యామా (33)
సీ. మగధేశ కులజాత మానవతీరత్న
మఖిలదాక్షిణ్య శీలాదిగుణము
లలరంగ నధ్వర ములకు దక్షిణవోలె
నమరుదాని సుదక్షిణాఖ్య వెలఁదిఁ
బరిణయంబై యేకపత్నీ వ్రతుండయి
నిజరాజ్యలక్ష్మియు నెనరు సతియు
నిఖిలవైభవములు నిండారఁ దనుపంగ
శోభనస్ఫూర్తుల సొబఁగుఁ గాంచి
తే. భద్రగుండైన యాదిలీప ప్రభుండు
తనకు ననురూప మైనట్టి తనదు భార్య
యందు సత్పుత్రుఁబడయంగ నభిలషించి
కొంతకాలంబు సైరించి యంతమీఁద. 73

—♦ దిలీపుఁడు మంత్రులయందు భూభారముంచుట ♦—

శ్లో. సంతానా (34)
క. సంతానార్థము యొకవిధి
స్వాంతంబునఁ గదురఁ జేసి యవనీ రాజ్యం
బంతయు సచివులపై నిడి
యంతట శుచులగుచు నింతి యతఁడు నిజేచ్ఛన్. 74

—♦ వారిగమన కాలములో ఏకరథారోహణము మొదలుగాఁగల గుణముల వర్ణించుట ♦—

శ్లో. అథభ్య (35)

ఆ. అల విరించి గూర్చి యట్టులార్చి స్మరించి
యులవరించి భక్తి నిలువరించి
నిష్ఠఁ బూజలుంచి నిజగురు నాశ్రమం
బునకు వెడలసాగి రెనసి మొనసి. 75

శ్లో. స్నిగ్ధగం (36) శ్లో. మాభూదా (37)

వ. అటుల నారాజదంపతులు ప్రయాణావసరంబున రథారోహ
ణంబు సేసి 76

సీ. మెఱుపును జౌదంతి మేటి నీలఘనంబు
పైని దో తెంచెడి భంగిలోప
స్నిగ్ధగంభీరనిశ్శేష నిర్ఘోష ల
వారితంబులుగాఁగఁ బాఱు తెంచు
కఱకాంతు లలరెడి కమ్మది రథంబుపై
ధనళవర్ణుఁడు ధరాతల విభుండు
మేల్మి బంగరుచాయ మే నొప్పు సతియును
దరలిపోవుచు నిజగురుని కెంత

తే. శ్రమము దోపకయుండెడి క్రమతఁ గూర్చు
తన కొఱం తగుసేన చేతనములకును
సహజ తేజో విశేషోత్క మహిమ వలన
నలవుఁ గలయట్టి దగు భంగి వెలయఁ జేయు. 77

శ్లో. సేవ్యమా (38) శ్లో. (39) (40) (41) (42) (43) (44) శ్లో.
హైయంగ (45)

వ. మఱియును సుఖస్పర్శంబును సాలతరుస్వరస పరిమళమిళితం బును విక్షేపిత కుసుమ పరాగంబును సంస్పందిత వనసందోహం బునునై వీతెంచు మందమారుతంబు మేన సోక నానంద మొందుచు రథవేగంబు చేతంబుట్టిన నేమి స్వనంబులు మేఘనినాదం బులని తలంచి యేతెంచు మయూరంబుల కేకారవంబులు మనోభిరామంబుగను షడ్జస్వర సమానంబుగను వినంబడుచుండ శ్రవణంబు సేయుచుఁ దమపోయెడి మార్గంబునకు సమీపంబు నందుండి రథావలోకనంబు సేయుచున్న మృగ మిథునంబు లయుఁ దమయు నేత్రసాదృశ్యంబుఁ బరీక్షించుచు నొండుయెడ స్తంభరహితంబైన బహిర్ద్వారంబునం గట్టెడు స్రక్శ్రేణి కరణి వరుస నెగసి కలకలంబు సేయుచుఁ బోవు సారసపక్షులఁ దల యెత్తి వీక్షించుచు నభీష్టార్థసిద్ధిఁ బడయు చందంబ యనుకూల త్వంబు వహించి వీతెంచు తెమ్మెరలచేతఁ దురగఖురోత్కీర్ణ రజంబు నిజాలకావేష్టనంబులకు స్పృశ్యమానంబు గాకయుండఁ బొసంగుచు నరిఁగెడి మార్గంబులోని కొలంకువుల భంగసం క్షోభ శీతలంబైన యరవిందామోదంబు స్వనిశ్వాసంబు ననుక రించుచుండ నాఘ్రాణించుచు నాఁడు క్రతునిమిత్తంబుగఁ దన చేత విసృష్టంబైన యూపంబుల చిహ్నంబుగాఁ గలట్టి యూత్మ దత్త గ్రామ బులందు యజ్వలొసఁగు సర్ఘ్యపాద్యంబు లాశీర్వా దంబు లందుకొనుచు నెదుర సద్యోఘృతంబుఁ జేకొని వచ్చు చున్న ఘోషవృద్ధుల వనంబులోని పార్శ్వవృక్షంబుల పేళ్ళడుఁ గుచుఁ డెరువునఁ బడిపోవుచుండ నప్పుడు— 78

శ్లో. కాప్యభి (46)

ఉ. హేమఁపుఁబోక పిమ్మటను హెచ్చగు శోభను డెల్గునట్టి చి
త్రామృతదీధితుల్ గతి నుదంచిత వేషులు నాసు దక్షిణా

భామ దిలీపు లిద్దఱు విభాసిలి రంత బుధోపముండు దాఁ
బ్రేమ విలోక నుండగుచుఁ గ్రేవలతత్త దశేష దృశ్యముల్. 79

—♦ సుదక్షిణా దిలీపులు వసిష్ఠాశ్రమమును పొందుట
ఆశ్రమమును వర్ణించుట, రథమునుండి దిగుట ♦—

శ్లో. తత్ర దూ్భ (47)

క. అరయుచుఁ గాంతకుఁ జూపుచు
వెరవుగ నొండొరుల వేడ్క పెంపొదఁవగ, దా
మరిఁగెడి తెరు వెటుగడచిరొ
గురు తెలుకరు లేక బ్రొద్దు గ్రుంకెడుతఱికిన్. 80

శ్లో. సవృప్రాప్య (48) (49) (50) (51) (52) (53) శ్లో. అథయం (54)

తే. దూరగమన ప్రయాసంబు దోరయు కతనఁ
గరము బడలికఁ గొను తురంగములతోడ
నన్యదుర్లభమైనట్టి యధిక యశుఁడు
మది నీ శుండు పత్నీసమేతముగను. 81

వ. వనాంతరంబుల నుండి సమిత్కుశఫలంబులు గొనివచ్చువారును దృశ్యంబు గాని యగ్నిత్రయఁబువలనఁ బ్రత్యుద్గతులైన ఋషుల చేతఁ బూరితంబైనట్టియు తృణధాన్యంబులఁ దినుచు ఋషి భార్యలబిడ్డలవలె నుటజద్వారంబుల కడ్డంబుగనుండు మృగం బులచేత వ్యాప్తంబైనట్టియు మునికన్యలు వృక్షసేచనంబు సేసి పక్షులు తడి యాలవాలంబులలోని నీళ్లుపానంబుసేయ వలయు ననెడి విశ్వాసంబుతోడఁ దత్క్షణంబ తముచేత విడువంబడిన వృక్షకంబులు గలట్టియు యెండమార్పడి యెడువేళఁ ద్రోసి ప్రోవు వెట్టెడు తృణధాన్యంబులఁ జేర్పంబడెడు నుట జాంగ ణంబు లందు నెమరువేయుచుఁ బరుండు జింకలుగలట్టియు ప్రజ్వలితంబైన త్రేతాగ్నులకు సూచకంబులై పవనోద్ధూతం బులై యాహుతి గంధ మిళితంబులైన ధూమంబులచేత సాశ్ర

మాగత జనంబులకుఁ బవిత్రంబు సేయు చున్నట్టిది యగు నవ్వ
సిష్ఠాశ్రమంబు సేరి రథంబునుండి పడఁతిం డింపి తానును డిగి
యశ్వంబులకు సేదఁదీర్చుమని సారథి కాజ్ఞ యిచ్చెఁ దద
నంతరంబ. 82

—♦ వారికి ఋషి సమూహము పూజ సేయుట వసిష్ఠుని జూచుట
అరుంధతీ వసిష్ఠులకు నమస్కరించి వారి యాశీర్వాదమును పొందుట♦—

శ్లో. తస్మైస (55) శ్లో. విధేస్సా (56) శ్లో. తయోర్జ (57)

సీ. ఘనశాస్త్ర దృష్టియుఁ గలవాఁడు రక్షకుం
డౌటఁ జేసియు నతం డర్హ్యముగను
నతి నియతేంద్రియు లై సభాసదులైన
ఋషులచేత సతీపరి వృతముగను
బూజితుండై పతి ప్రొద్దువోయెడు వేళ
సకలవిద్యావసాన సమయమందు
స్వాహాచే హుతభుజు వలె నరుంధతిచేతను
పాసితుండైన తాపసు వసిష్ఠుఁ

తే. గాంచి తానును సతి నమ్ర గాత్రులగుచు
వ్రాలి గురు పత్నులయు పదగ్రహణ మొనరఁ
జేయ వారును బ్రీతి నాశీర్వదించి
రెంతయు సగౌరవముగఁ గొఱంత లేక 83

—♦ వసిష్ఠుఁడు కుశల మడుఁగుట, దిలీపుఁడు వసిష్ఠునికిఁ
దన క్షేమమును దెలుపుట ♦—

శ్లో. తమాతి (58) శ్లో. అథాథ (59)

ఉ. ఆ భువనేశు నమ్మునియు నాదర మొప్పఁగ నాతిథేయ స
ద్వైభవ సత్క్రియాచరణ సత్కృతుఁ జేసి కరంబుమై రథ
క్షోభ పరిశ్రమం బుడిపి సూక్తిని దాఁ గుశలంబె యంచనన్
శోభితనైజ రాజ్యపరిశుద్ధ సమాశ్రమ మానియుం దగన్. 84

తే. అర్థపతియును గడువక్తయగుట నెంత
యును వెరవుఁ గలిఁగి తనదు యుక్తిఁదెలుప
నల యథర్వణవేది ముంగలను నిట్టు
లను ప్రయోజనమును గరం బనునయింప 85

శ్లో. ఉపప (60)

ఉ. రంగుగ రాజమంత్రి హిత రాష్ట్ర చయాదికమైన నాదు రా
జ్యాంగ మదెల్లయుం గుశల మంతకు దైవిక మానుషంబులన్
సంగతమౌచు నాకు నవశంబుగ వచ్చెడి యాపదల్ నివృ
త్తింగనఁ జేయఁ దారును ప్రతీకృతి దక్షులు గారె యారయన్. 86

—♦ వసిష్ఠుని మాహాత్మ్యమును వర్ణించుట ♦—

శ్లో. తవమం (61)

ఉ. నా శరముల్ పరోక్షమున నాశ మొనర్పఁగ లేవు శత్రులం
గౌశల దృక్ప్రసారములఁగాక మహాద్భుత శక్తి సంపదా
వేశుల రిద్ధమంత్రచయ వేత్తలకౌట భవన్మహా ప్రశ
స్తాశయ మంత్రజాల మపహం బొనరించుఁ బరోక్షమందునున్ 87

శ్లో. హవిరా (62)

ఉ. హోతలరైన తారు సుమహోన్నత శాస్త్ర విధి క్రమంబుగాఁ
బూతమహాగ్ని హోత్రముల భూరిహవిస్సులు నిండఁజేసి ని
ర్వాత సువృష్టినిం గురిసి వగ్రహపీడ లనారతంబు నెం
తో తడవాట్లకుం బొరయకుండఁగఁ జేయరె సస్యకోటికిన్. 88

శ్లో. పురుషా (63)

చ. పరిమితిలోడఁ బూరుషుల పట్టగు జీవితమైన నాయు వ
త్సరములు మత్ప్రజల్ బ్రతుకజాలుదు రింకయు నీతిబాధలం
బొరయకయుందు రార్యవర పోడిగ మీ దగు సత్త్వ వృత్త సం
స్మరణ సమృద్ధియే నిరుపమానము మైతగు కారణంబుగాన్. 89

శ్లో. త్వయ్యేవం (64)

చ. అవని భవత్ప్రభావ మరయం గలవార మె బ్రహ్మవంశ సం
భవులరు మాకు సద్గురులు భద్రగుణాటను మీ ప్రభావవై
భవమున దుర్విపద్రహితభంగి నదేల చెలంగ వెమ్మెయిన్
వివిధ మదీయసంపదలు వెక్కసమై ననువీడకుండఁగన్ 90

—♦ దిలీపుఁడు తనకుఁబుత్రులు లేకపోయెనని చింతించుట ♦—

శ్లో. కింతువ (65)

ఉ. ఇమ్మగు దీవులుంగలిఁగి యిమ్మహి రత్నజనీన యయ్యు నా
కొమ్మగు నట్టిమీ యనుఁగుఁగోడలు పట్టఁపుదేవియందు నా
కమ్మగు సాటియైన యొకమ్మువహించిన పుత్రరత్నమం
దమ్ముగ నాకుఁగల్గమి ముదమ్మొనగూర్పఁగఁ జాలదెమ్మెయిన్ 91

శ్లో. నూనమ (66) శ్లో. మత్పరం (67)

వ. అట్లు గావుననామనంబు సంతసింపదు మఱియు నాకుఁ బుత్రుం
డులేనియెడ నాయనంతరంబు పిండప్రదానంబు సేయంగలవారు
లేరనుతలంపున మత్పితృదేవతలు తమకు భోజ్యంబైన స్వధయం
దాసక్తులైనను నియతంబైన శ్రాద్ధసమయంబులందు నిత్యంబు
గాదని యథేష్టంబుగ భుజియింపంజాలకుండుదురు. తిలోదకంబు
లిచ్చెడివారు లేరని నిట్టూర్పులువిడుతురు. తదీయ నిశ్వాసేషదు
ష్ణంబులైన మదీయదత్తోదకంబులు గ్రహియింపకుండుదురు.

శ్లో. సోహమి (68)

మత్తకోకిల. ఏను యజ్ఞములాచరించి యహీనదేవఋణంబు నెం
తైనఁ దీర్చి కడున్ విశుద్ధుఁడనై ప్రకాశముగాంచి నం
తానహీనతఁ బైతృకంబునఁ దక్కియున్న ఋణంబుఁబెం
పూని తీర్పమి నప్రకాశత నుంటిఁ జుట్టుమలంబలెన్ 93

శ్లో. లోకాంత (69)

తే. తపము దానంబువలనను దనకుఁగలుఁగు
సుకృతమున నల్లపరలోక సుఖము లొదవు
నుత్తమం బగువంశమందున్నత మగు
సంతతిని గన్న నిందందు జరుఁగు సుఖము 94

శ్లో. తయాహి (70)

చ. చలమున సృష్టిఁజేయఁ గలశక్తిగలారు ప్రియంబునాయెడం
జలిపెడివారు నాకుఁగలసంతతిలేమనిగూర్చితారు నీ
రలవుగఁ బోసి యాశ్రమమునందునఁ బెంచినవృక్షకంబు తాఁ
బెలుచన గొడ్డుపోఁ బరితపించినయట్లు దపింపఁ గేలకో 95

శ్లో. అసహ్య (71) శ్లో. తస్మాన్మ (72)

ఉ. ఏను సహింప మజ్జనవిహీన మదద్విపమర్మభేద నా
లానముభంగి నాకతిభరం బగునట్టిబెడంద పైతృకం
బైన ఋణంబు యోవరగుణాఢ్య తదీయవిముక్తిఁజెంద నె
ద్దాన నుపాయమౌ నదియుఁ దప్పకఁ జేయవె మీకు నర్హమౌ. 96

క. ఇక్ష్వాకు వంశ జాతుల
పక్షంబుగఁ గార్యసిద్ధిఁ బడయం జేయం
దక్షత నసాధ్యమైన న
పేక్షింతువు నీవుఁ జేయు ప్రేక్షను దండ్రీ. 97

—♦ దిలీపుని గూర్చి సంతానము లేకపోవుటకు హేతువును
అందుకు భంగమును దెలుపుట ♦—

శ్లో. ఇతివి (73) (74) (75) (76) శ్లో. అవజా (77)

వ. అని యిట్లు దిలీపుండు విన్నవింప విని వసిష్ఠుండు, నిద్రఁబోయెడి మత్స్యంబులు గల మడుంగు తెఱంగున సంచలనంబు నొందక యొక్క క్షణంబ నిమీలిత నేత్రుండై యేకాగ్ర చిత్తంబున నాత్మ భావనంబుచేసి యన్నరపతికి సంతానప్రాప్తి గాకుండుట

కుం గారణంబుఁ దెలిసికొని యిట్లను. దొల్లి నీవు సురపతిసందర్శనంబు సేసి మగిడి భూలోకంబున కరుదెంచునప్పుడు దారిలోనఁ గల్పవృక్షంబు నీడనున్న కామధేనువుం గని ఋతుస్నాతయైన నీభార్యం గవయుకున్న నధర్మంబు సేకుఱు ననుభయంబున నచింతిం బోవుచు నద్ధేనువునకుం బ్రదక్షిణంబు సేయమి నప్పుడుకుఁ దోడుకు నీచేసిన యవమానంబుపడి మత్సంతత్యారాధనంబునంగాక నీకు సంతతి గలుఁగ కుండునని శాపంబిచ్చె నాసమయంబున. 98

శ్లో. సశాపో (78)

శా. ఆకాశాపగ నంబు లాడి కడనే న్గవ్వారిలో బృంహితో
ద్రేకధ్యానముఁ జేసె శాపవిధముం దెల్లంబు నీసాదికిన్
నీకుం దావన గాకపోయెఁ దెలియన్ నిక్కంబు భూపాల మీ
పోకై మీరలు పోయిరంత వినుమా పొక్కెల్ల నీకేర్పడన్. 99

శ్లో. ఈప్సితం (79)

క. పూజింపఁ దగరె పూజ్యులు
పూజింపమిఁ జేటురాదె పుణ్యసురభినిం
బూజింపమి నవమాన
వ్యాజంబునఁ గాదె నీకు వచ్చె నిదెల్లన్. 100

శ్లో. హవిషే (80) శ్లో. సుతాంత (81)

సీ. దుర్వార బహుసర్ప దుర్విగాహద్వార
కలితపాతాళ లోకమున నిపుడు
చిరకాలయాగంబు వరుణుండు గావింప
నయ్యావు హవిరర్థ మటవసించె
నట్లు గావున దాని కైమేల జతనంబు
తత్పుత్రి నందిని తనరఁ గలదు

వడి నీవు సురభి కిమ్మడి గాఁగ నలదాని
నీ దేవితోఁ గూడ నిర్మలుండ
తే. వగుచు సేవింపు మిగుల ము దావహముగ
నడిియు నీకోర్కెఁ జేకూర్చు నదియ చూవె
యనుచు నిట్లు వసిష్ఠుండు నవనిపతికి
వలయు నట్టిద యగుదానిఁ దెలుపుచుండ. 101

—♦ నందినీధేనువు వనమునుండి వచ్చుట ♦—

శ్లో. ఇతివా (82)
క. తన కాహుతి సాధనముగ
ననుకూలిని యైన యట్టి యానందిని యం
తనె వనమునుండి తనం
తనె తా నరుదెంచె నటకుఁ దగఁ బ్రియ మొప్పన్. 102

—♦ నందినీధేనువుయొక్క గుణములను వర్ణించుట ♦—

శ్లో. లలాటో (83) శ్లో. భువంకో (84) శ్లో. రజఃక (85) శ్లో. తాం
పుణ్యా (86)
తే. పల్లవస్నిగ్ధ పాటల వర్ణ యగుచు
వక్ర లాంఛన భాక్ఫాల భాగ యగుచు
నురుఘట ప్రతిమాన పీ నోధ్ని యగుచు
నద్భుతంబుగఁ జూపట్టె ముద్భవముగ. 103

ఉ. * నందిని సారథీమదభినందిని భక్త ముఖేందు చంద్రికా
స్పందిని సద్యశోభి నవచందిని సజ్జనవందినిన్ శ్రితా
క్రందిని గాంచి రయ్యెడ నిరంతర శిష్ట సుఖోపవిష్టమున్
ఛాందస వేష్టితంబు నగు చారువసిష్ఠు నుపాశ్రమస్థలిన్. 104

సీ. వక్రితసితరోమ వక్త్రయై నెలతోడి
సంధ్యారుణద్యుతిఁ జాటుదాని

* అధికము

వత్సావలోకనా వర్తితోత్సాహయై
క్షితిఁ బయోధారఁ బ్రోక్షించుదాని
నిజ ఖురోద్ధూతభూ రజముజల్లునఁ బతి
మంచి తీర్థంబు లాడించుదాని
సహజ సందర్శనావహసుప్రసాదయై
యంచిత శుభము సూచించు దాని
తే. నందినిని గాంచి తా రాకయందు శకున
మిష్టసిద్ధికి నమ్మాని స్పష్ట మరసి
మానవేంద్రుని తోడఁ బ్రగమ్ముఁ బలికెఁ
దోడఁగె నిట్టులఁ దాఁ జేయఁ దొడఁగు విధము. 105

శ్లో. అదూర (87)

తే. పరమకల్యాణి యిదిగాన ధరణినాథ
తత్ప్రసంగంబుఁ జేసెడి తరుణముననె
మన కురంగట కదివచ్చె నెనయు శుభము
చేరువను నీ కభీష్టార్థ సిద్ధి యగును. 106

—♦ నందినీ ధేనువుయొక్క సేవఁ జేయురీతిని దెల్పుట,
వసిష్ఠముని యాశీర్వదించుట. ♦—

శ్లో. వన్యవృ (88)

క. వ న్యాహారముఁ దిని నం
దిన్యనుగతిఁ దత్ప్రసాదధృతిఁ బడయుమ సౌ
జన్యతఁ గలపునఁ గరము న
గణ్యకళా సుముఖమొందుకై వశి నధిపా

వ. అది నీకుం బ్రసన్నయగుటకుఁ దదారాధన నిమిత్తంబుగ నద్దే
నువు ననుగమింపవలయుఁ గాన సదిపయనంబై బయలువెడలు
నప్పుడు నీవును దానితోడన చని. 108

శ్లో. ప్రస్థితా (89)

క. నడచు నెడ నడచుచుండియుఁ
గుడుచు నెడం గుడుచుచుండి కూర్చుండు నెడన్
నడ నుడిఁగి కూరుచుండియు
నడువడిఁ గడు నినుమడించి నడువఁగ వలయున్ 109

శ్లో. వధూర్భ (90) శ్లో. ఇత్యాప్ర (91)

సీ. నీదేవియును భక్తి నెఱపినచిత్తంబు
గలదియై ప్రత్యూషఃకాలమందు
నీకును గడుఁ బూజ నీయురాలైనట్టి
నందినితోడ వనంబు నకును
నరుఁగంగవలయు దినాంతమం దెదురేగి
సంగతి నేగుదె రంగవలయు
నది నీ కనుగ్రహం బొదవించునందాఁకఁ
దగ నూడిగంబుఁ దత్పరతఁ జేయుఁ

తే. డారి తేరి నిరంత రాయమునగ నీదు
వ్రతము తుదముట్ట నగుఁ గాత బ్రౌఁతి నీదు
జనకునకు వలె నీకును దనయు లుద్భ
విలతు రని మానివరుఁడు దీవించి పలుక 110

—♦ దిలీపుఁడు వసిష్ఠుని యొక్కయాజ్ఞ నంగీకరించుట ♦—

శ్లో. తథేతి (92)

ఆ. అదె మహాప్రసాద మని సతీయుతముగా
వరమునిశు నాజ్ఞ శిరము దాల్చి

యటుల వర్తిలంగ నానతుండై నిల్చి
దేశ కాలవిధుల తెలివిం గలిగి 111

శ్లో. అథప్ర (93) శ్లో. సత్యామ (94) శ్లో. నిర్దిష్టాం (95)

సీ. వెండియు బ్రహ్మ పుత్రుండు దోషజ్ఞుండు
దానిశాముఖమున ధరణిపతికి
శయనింపుమని యాజ్ఞం జయ్యనంగాంజేసి
సువ్రతాచరణ సంశుద్ధి కొరకు
నిజతపస్సామర్థ్య నిర్మితంబుగంజేసి
రాజయోగ్యాహార రాజినిడంగ
వలను గాకల వన్య ఫలదర్భశయ్యాది
సామగ్రి నియమించె సముచితముగ
తే. నివ్విధిని నేర్పడంజేయ నవ్విభుండు
పర్ణశాలను బడతితోం బండి యపర
రాత్రి మునిశిష్యులయు శ్రుతిరాజిపఠన
కల కలంబున మేల్కని యలరి లేచి 112

— సర్గాంతము —

చ. నిరవధి తత్త్వరూప వరణీయనిసర్గ యశోరణీయ ని
ర్జర మహాలోమహీయ శుభరాజి విరాజిత సత్త్వ భాసురా
గురు చరణాధికార నిజగుహ్య నిరామయతత్త్వ పూర్వక
స్మరణ కలాప నిస్తరణ చాతురితా గుణ సంప్రవాహకా 113

క. సాదర సరసాలాపా
సాదిత నిజ సంశ్రితౌఘ సంచితపుణ్యా
చ్ఛాదిత విపులోఘా ని
త్యోదిత సుషమా సముద్ఘ ద్యోతన దీక్షా 114

మాలిని

వినుత సుగుణజాలా విశ్వసంత్రాణశీలా
జనన మరణదూరా జంతుసంఘ ప్రచారా
ఘనతరనయభాషీ గాఢవిద్యాభిలాషీ
కనదురు శుభకీర్తి కల్మషచ్ఛేదవర్తీ. 115

గద్య

ఇది శ్రీమ దశరథపరబ్రహ్మవంశనాభిలాష పరమానంద
భరితమనీషావిశేష మరిచెర్లవంశపయఃపారావార
రాకాసుధాకర వినుతగుణాకర పరోపకార
సూత్ర శివున్నాయక సుపుత్ర బుధజ
న విధేయ జగన్నాథ నాయక నా
మధేయప్రణీతంబైన రఘు
వంశ మహాకావ్యంబు
నందు ప్రథమ
సర్గము.





శ్రీ పరబ్రహ్మణేనమః.

# ఆంధ్రరఘువంశ మహా కావ్యము



## ద్వితీయ సర్గము

శ్రీకార సర్వతోముఖ
సాకార విరాజమాన సామ్రాజ్య ధుర
స్వీకార చర్య బహుళా
ధీకారుణి కాది భాగధేయ మహాత్మా.

—♦ దిలీపుఁడు గోసేవా పూర్వకముగా వనసంచారము
చేసిన వివరణము. ♦—

శ్లో. అథప్ర (1) శ్లో. తస్యాఃఖు (2) శ్లో. నివర్త్య (3) శ్లో. వ్రతాయ (4)

వ. అంతట దిలీపుండు తెల్లవాఱుటఁ గని నందినీధేనువుం దన పత్ని యగు సుదక్షిణాదేవి చేతం గంధ మాల్యంబులతోడ నలంకరింపం జేసి క్రేపుం బాలు గుడువనిచ్చి త్రాటంగట్టి యయ్యావును వనంబునకుం బో విడువ నప్పుడు పతివ్రతా రత్నంబును స్వధర్మ పత్నియునైన యా సుదక్షిణయు నద్ధేనువు వెంబడిఁ దత్ఖురన్యాసపవిత్ర రజోత్కీర్ణంబైన యమ్మార్గంబుఁ ద్రొక్కికొని వేదార్థంబును స్మృతు లనుసరించుట పోల్కిం బోవు

చుండె సంతతఁ బరమదయాళుండును గీర్తి శోభితుండునైన యద్దిలీపుం డమ్మగువం గ్రమ్మతించి యతం డమ్మొదవు తోడను వెనుకొని పయోధర చతుస్సముద్రపరీత గోరూపధరిత్రీ వలయంబు రక్షించుట నా వెలయఁ దదనుచరుఁడై వ్రతంబు వట్టి యగ్గవి సేవించుచు నిజవంశపరాక్రమక్రమంబుగ భుజశక్తి సమర్థంబు గానఁ బించి యాత్మరక్షణంబు గావించుకొనం దాన చాలి యన్య సహాయం బపేక్షింపక భృత్యవర్గంబు వీడ్కొని యాతం డద్దానితోడన చని. 2

శ్లో. ఆస్వాద (5)

సీ. పచ్చవాఁటినమంచి పచ్చిక నునుమోరఁ
గుడువ ముద్దగఁ బెట్టుఁ దడవి తెచ్చి
ముచ్చటారంగ నన్నుప్పుఁ గోరెడిసౌఖ్య
మాన నల్లన వ్రేళ్ళ మేని గీరు
గీముల విడఁబాఱి గీపెట్టిపాఱుచుఁ
గాటువెట్టిన దోమదాటుఁ దోలు
విచ్చలవిడిఁబోవ ముచ్చటయగు వేళ
నంకిలి వెట్టంగ శంకఁజేయు

తే. మండలేశ్వరుఁ డెంతయు మహితభక్తి
నందినీధేను పరిచర్య లందు మిగుల
శ్రద్ధతోఁడుత ననుకూల బుద్ధిఁ గలిగి
మెలఁగు నారాధనముతోడి చలముకొలఁది. 3

శ్లో. స్థితస్థి (6)

సీ. ఎండఁ గ్రాఁగినమేన నిండిన నుడుకారు
నందాఁక నిల్చిన నందనిల్చు
నడఁ గాలియలసట నుడిఁగిన యందాఁకఁ
గుదిసి కూర్చుండినఁ గూరుచుండు

దప్పితీరఁగఁ నీరుఁ ద్రాఁగఁ బోనందాఁకఁ
దవిలితోడన నీరుఁ ద్రాఁగఁ బోవుఁ
గడుమేరఁ ద్రిమ్మరి బడలినిద్రించిన
నిల్కడ నందాఁక నిద్రఁజేయు
తే. భూతలేశుండు నందిని బ్రోదిసేయుఁ
దోడ నెప్పుడు విడువని నీడవోలె
మేనిపా టెల్ల దానిసేవానురూప
ములన చొప్పడఁ జేయు నిమ్ముల వహించి. 4

శ్లో. సన్యస్త (7)

ఉ. ఏకవిశేష తేజమున హెచ్చుగఁదోచె విభుండు రాజ్యల
క్ష్మీకర ఛత్రచామర నిషిద్ధుఁడ యయ్యును క్షిప్తదానరే
ఖాకృతియైన దంతివరుఁ డాంతరగుప్తమదంబుచే సము
త్సేకముగాఁగఁబొల్చుగతిఁ దేకువటూహలపోల్కికిందగన్ 5

శ్లో. లతాప్ర (8)

చ. వలనుగఁ గేశపాశి చెలువంబగుతీవల నెత్తికట్టి పెం
పెలయఁగ నల్లెత్రాఁటి విలునెక్కిడి వెన్నుడి ధేనురక్షకై
వలయు నెపంబుతోడ గరువంపుమెగంబుల శిక్షసేయఁగాఁ
దలకొనువాఁడనంగ వనధాత్రి నరేంద్రుఁడు సంచరించుచున్ 6

శ్లో. విసృష్ట (9)

చ. భట విరహత్వముం గడవఁబడ్డది గాఁగను రెండువైపులన్
విటపిచయంబుఁ జేరుపెనుపేర్పులపక్షికు లారవంబుఁ దా
రటుపరికింపు డీవనిసమస్తవిశేషము లంచుఁజెప్ప చెం
గట భటవర్గఁపుంబలుకుఁగా విను నవ్వరు ణోపముండటన్ 7

శ్లో. మరుత్ప్ర (10)

చ. కరువలి నేస్తివోలెఁ బ్రభఁ గ్రాలుచుఁ బుష్పలతాచయంబులం
దరిదిగ సంచరించునెడ నాతనిపైని మరుద్గతిన్ లతల్

విరులను రాల్చుచుంటఁ గడువింతగు లాజలు పౌరకన్య లా
పురిదరి నేగుదెంచు నృపపుంగవుపైఁ గురిఁ జల్లునట్లుగాన్ 8

శ్లో. ధనుర్భృ (11)

చ. క్షితికర ధన్వియైనను విశంకమనంబు దయార్ద్రభావసం
వృత మయి నైజమైన విపరీతమనోహరమూర్తిఁ దద్మృగా
యతి సఫలత్వ మొందఁగ మృగానవళు లట్టి నిరీక్షసేయు వ
ర్జితభయచంచలత్వ రయచిత్త నిరస్తపలాయనంబుతోన్ 9

శ్లో. సకీచ (12)

—♦ మానినీవృత్తము ♦—

వర్ధిలు మారుతవర్తనఁ బుట్టినవంశకురుంబ రవంబులు న
వ్యర్థముగాఁ బొదలందెపుడుం జెఱలాడెకి వారలయవ్విధిగాఁ
బార్థివుకీర్తిఁ బ్రవర్ధిలఁ బాడి రపార మరణ్య దివౌకసు ల
త్యర్థముగాఁగను నన్నటులుండెను సార్ధకరీతుల నారయుచోన్ 10

శ్లో. పృక్తస్తు (13)

మత్తకోకిల. ఛత్ర చామరవర్జితుండయి చారుసువ్రతచర్యతో
గాత్ర మాతపబాధనొంద నిగారమానలవానికై
గోత్ర నిర్ఝరవారిశీకర గోష్ఠిసేయుచు వాయువుం
ధాత్రిజాకర పుష్పగంధ విధాయియై చరియించెఁగా. 11

శ్లో. శశామ (14)

మ. ముని గోరక్షకుఁడైన యాతఁడు వనంబుంజేరు నానాఁటినుం
డి నరణ్యంబు దవాగ్ని శాంతివడె వృష్టిప్రాప్తియున్ లేక యే
ఘనమై పుష్పఫలాభి వృద్ధిఁగనె వృక్షవ్రాతముల్ హీనజం
తు నికాయం బలిఁ బొందదయ్యె హరిశార్దూలాదిసత్వాప్తిచేన్. 12

శ్లో. సంచార (15)

ఉ. పల్లవకాంతివోలె నెఱబాఱినదీప్తుల రూఢిగా జగం
బెల్లను బర్వె ఘృసపతి యెప్పటి గ్రుంకినయట్లు నందినీ

తల్లజ మంగరక్తిమం దతంబయి యవ్వనిఁ బావనంబుగా
నల్లఁజరించి సాయమున నయ్యెడనుండి పునఃప్రయాణమై. 13

శ్లో. తాందేవ (16)

మ. చనఁ దోతెంచుచుఁ దోడవెన్కను వరత్ప్మిపాలుతోఁగూడి యా
ఘనదేవాదిపితాతిథిప్రియద యాగశ్రాద్ధ దానంబు లం
దనుబంధించు ఘృతాదులీఁ జతురయా నయ్యావు సత్కార్యవి
ధ్యనుగ త్యాస్తికతా ప్రబుద్ధియనగన్ సాక్షాత్కరించుం దగన్. 14

శ్లో. సపల్వ (17)

చ. ఉరవడి నీరుపల్లములనుండి బయల్పడి పాఱుతెంచు సూ
కరములు నిమ్మ్కలై తగు నగమ్ములఁ జేరఁగవచ్చు బర్హి ఖే
చరములు మెత్తమై తగిన శాద్వలముం దరియంగఁ జొచ్చు లే
ళ్లరిదిగఁ గల్గి యిర్ల నలుపారువనంబు లతండు సూచుచున్ 15

శ్లో. ఆపీన (18)

చ. ఉరుతర పీనభారకలితోధ్నియు గృష్టియునైన దాని సొం
పరి దలఁచెని దా గురుతరాంగ పరిస్ఫుట రామణీయకం
బిరుదెఱఁగై వనీపథి రహించిన భాతి నలంకరించె న
చ్చెరువుగఁ దోప నేరికి విశేషముఁగోడిద సొంపుకల్మి నాన్. 16

శ్లో. వసిష్ఠ (19)శ్లో. పురస్కృ (20)శ్లో. ప్రదక్షి(21)శ్లో. వత్సోత్సు(22)

వ. కొంతవడికి వసిష్ఠాశ్రమంబునకు దిలీపుండు గోవుతోడను వెను
కొని వచ్చుటయు నంతధర్మపత్నియైన సుదక్షిణాదేవి సాను
రాగంబుగ నెదుర్కొని ప్రేమభరంబైన చూడ్కుల నుపవాసుల
పానంబు కరణియుందోప ననిమిషయై నిజపతి నవలోకించుచు
నిలువంబడియుండ నన్నందిని యయ్యుద్దఱినదుమ నిజాంగ
రాగంబున మెఱసి దివారాత్రంబుల మధ్యస్థమైన సంధ్యవలెం
దోచె నప్పుడు సుదక్షిణయు నక్షతపాత్రంబుఁగేలం ధరించి
యుద్ధేనువునకు వలగొని నమస్కరించి యుక్షతలంద దీయవిశాల

శృంగద్వయ మధ్యంబు సర్వసిద్ధినిమిత్త మార్గంబునుంబలెఁ
బూజింప నదివచ్చిన తోడన లేగం గలియంగల కుతుకంబాఁగి
కొని మిగుల స్థిమితయై తత్పూజంగైకొనె నందుల కవ్వధూవ
రులును సంతసించిరి నందినీసదృశంబగుమహాత్ముల ప్రసాద
చిహ్నంబులు భక్తిశ్రద్ధలుగలిగిఁ సపర్య లొనర్చునైష్ఠికులకు
ముందొడఁగూడు ఫలంబులు గలవైయుండు. 17

శ్లో. గురోస్స (23)

ఉ. బాహుజితారి యానృపుఁడు భక్తిమెయిన్ సతితోడ నున్న వి
ద్యాహితుఁడైన యాగురుపదంబులకుం బ్రణమిల్లి మాపునన్
వేహితమైన కర్మలను వేడ్కనొనర్చుక చేసె దోగ్ధ్రికిం
దోహదమైనపిమ్మటను దొట్టిసపర్యలు భార్యతోడుతన్ 18

శ్లో. తామంతి (24)

చ. బలులును దీపముల్ తనదుపజ్జ సమర్చుక రాత్రియెల్ల వ
ర్తిలఁ దెలవారుదాఁకయును దీనజ నోద్ధరణోచితుండు దాఁ
జలుపును గూర్కు యాతొడుకుసల్పిన లేచినలేచు మాపురే
పులు ననకిట్లునాఁక ననువుంగలభంగుల నన్నివేళలన్ 19

శ్లో. ఇత్థంవ్రవ (25)

క. అదన బదనెఱిఁగి భావము
సమనుగ నొనరించిచేసె శ్రద్ధాభక్తుల్
పదిలపడఁ జేసి మొదవున
కొదవగఁ బరిచర్య లిరువ దొక్కదినంబుల్ 20

వ. ఇట్లు సంతానార్థంబు గోసేవాతత్పరత్వంబున నేకవింశతిదినం
బులు వ్రతంబుకడచనినపదంపడి దిలీపుండు తదనుచరుఁడై
మఱునాఁడ వెమ్మదవుతోడను వనంబున కేగుటయు సంతసది. 21

—♦ దిలీపుని యొక్క భక్తిని పరీక్షించుటకై నందినీధేనువు గుహలోఁ బ్రవేశించుట. ♦—

శ్లో. అన్యేద్యు (26)

ఉ. తేజితకీర్తి భక్తి వ్రతదీక్ష యదెట్టిదో చూడఁగోరి గం
గాజలపాతసన్నిధిని గ్రాలెడి లేఁగసవుండుచోట గౌ
రీజనకంబునౌ హిమగిరిప్రధి గహ్వరమందుఁ జొచ్చె వి
భ్రాజిలి హోమధేను వటు గన్ననఁ జొచ్చిన నాతఁ డంతలోన్ 22

—♦ మాయచే కల్పింపఁబడిన సింహము నందినీధేనువు నాకర్షించుట ♦—

శ్లో. సాదుష్ప్రి (27)

ఉ. ఆహిమవన్నగాభిముఖుఁడై యటరాజిలు గైరికాది తే
జోహిత శోభనంబుల ఋజుత్వ మదెల్లను జూచుచుండె ను
త్సాహముతోడ సత్వభయ సాధితగానిది గోవటంచు న
చ్చోహరి యొండు యుజ్జ్వలతఁజూపి హఠాత్తుగ దానిపైఁబడెన్ 23

—♦ నందినీదీనారవము దిలీపదృష్టిని వెనుకకు ద్రిప్పుట ♦—

శ్లో. తదీయ (28)

శా. ఆ లీలం గిరిగహ్వరంబున మృగేంద్రాసన్నయై యద్ది యా
ర్తాలాపధ్వనిఁ జేసినన్ విని విపన్నాసక్తుఁడై వేగిరం
బాలోఁ బగ్గము లీడ్చినట్లు గనువృష్టియ్యావుపై నద్రిశో
భాలోకంబును మాని త్రిప్పె ననుకంపాలోలితస్వాంతుఁడై. 24

—♦ దిలీపుఁడు ధేనువుపైనుండిన సింహమును జూచుట ♦—

శ్లో. సపాట (29)

శా. ఆలోనం గవి రాగవర్ణినిపయిన్ హర్యక్షముం గాంచెఁ దా
శైలం బందున ధాతు సానువుపయిన్ సంఫుల్ల లోధ్రద్రుమం
బాలోకించిన యట్లు నంతవడి తో నాశ్చర్యమగ్నాత్ముఁడై
ప్రాలెం బజ్జహరించె నాతొడుకుఁ దా వాపోయి మూర్ఛిల్లెనో. 25

—♦ దిలీపుఁడు సింహమును జంప నమ్ములపొదినుండి బాణము తీయ యత్నించుట ♦—

శ్లో. తతోమృ (30)

చ. అని పలవించి యేమఱిలి యాదరమందు నలక్ష్యపెట్టి మ
న్నున నపరాధినైతి నయొ నోర్వఁగదే గననైతి నద్రిత
న్నునఁ బడియుంచు సింహగమనుండయి నందినిగావ సింహముం
దునుమఁగ సాయకంబుఁ ద్వరతో దొనయందునఁ దీయఁబోవఁగన్.

—♦ దిలీపుని భుజముపట్టుకొనిపోవుట ♦—

శ్లో. వామేత (31)

ఉ. ఆతనిదైన దక్షిణఁపు హస్తము యాదొస నిల్చిపోయెఁ బ్ర
ఖ్యాతుఁడు సొన్పుచో వరనఖద్యుతిరూపిత కంకపత్రమున్
జాతరుచి ప్రశస్తమగు సాయకపుంఖమునందు సాంగుళీ
వ్రాతము సోచుఁ జిత్రమునఁ బ్రాఁతిగవ్రాసిన బొమ్మయుం బలెన్.

—♦ అడ్డగింపఁ పడిన పరాక్రమముచేఁ బుట్టిన సంతాపము ♦—

శ్లో. బాహుప్రప (32)

ఉ. హరి మహిమంబునం గర మడట్టులనుండఁగ నోసరిల్లి య
ధరణిఁపుఁ డట్టె మండిపడె దాఁపున శత్రువు వేయరాక త
ద్దిరి నపరాధిఁ దాఁకి తన తేజ మెలర్పమి మంత్రభేష జో
త్కరమున రుద్ధమైన యురగంబువలెన్ గడుఁ గోపఘూర్ణుఁడై. 28

వ. ఇట్లు దిలీపుం డవశ్యహస్తుండై యుపాయంబులేక మనోయాసం
బునంబడి వ్యర్థప్రయోజనుండై యుండె నప్పుడు. 29

—♦ సింహము తనమహిమను చెప్పుచు దిలీపుని వెళ్ళిపొమ్మనుట ♦—

శ్లో. తమార్య (33)

చ. పలికె మనుష్య వాక్యములఁ బోటిలఁ దన్ముఖరోద్యమాన గో
స్థలితునితో గజారి యవగాహితసింహసమాన సత్వుతో

నల మను సంతతిప్రముఖుఁడై చను వంశలలాముతో బృహ
త్యలఘు నిషంగబద్ధభుజుఁడై పలవించు విచిత్రచేష్టతోన్ 30

శ్లో. అలంమ (34)

క. భూపా శ్రమపడ వలవదు
నాపై నస్త్రంబువేయ నాఁటదు వృథయాఁ
జూప నగునె వడి పాదప
చోపనబలుఁడైన విన్నుచూలికి గిరిపై 31

శ్లో. కైలాస (35) శ్లో. అముంపు (36)

సీ. ధరణీశ కైలాసగిరిఁబోలెఁ దనుకాంతి
నెసఁగెడి వెలిగిబ్బ నెక్కువాని
నాపరేశుని పదన్యాసప్రసాదపూ
తంబగు వీఁపును దనరునట్టి
వాఁడ నష్టస్వరూపకుఁడైన యీశు భృ
త్యుండ నికుంభతు ల్యుండ నాదు
నరయంగఁ గుంభోదరాఖ్యుండనైన న
న్నిట్టివానిఁగ నింక నెఱుఁగు మీవుఁ

తే. దెలియు మీ మ్రోలఁ గన్పట్టు దేవదారు
వజుఁడు సుతుఁ బోలె నర్మిలి నరయుదీని
నగసుతాహేమకుంభస్తన ప్రసృతప
యోరస మెఱుంగు నిదియె గుహుండుఁబోలె 32

శ్లో. కండూయ (37)

ఉ. కొండొకవేళ నీతరువు గోల్పడె వన్యమదేభసంస్పృశ
ద్గండతటంబుగీరుకొని త్వక్కదియూడియు గాయమైనఁ దొ
క్కిండికి నోర్వ కేడ్చెఁ దమకించి హిమాచలకన్య దైత్యకో
దండము లేచి దాఁకుఁ తఱిఁ దా ధ్వజినీపతి యార్తికిం బలెన్ 33

శ్లో. తదాప్రప (38)

చ. అది మొదలీశ్వరుం డడవియందలి హస్తిభయార్తులింక నిం
దొరదవక యుండునట్లు భయదోజ్జ్వల సింహపు రూప మిచ్చి క
ట్టెదురుగ వచ్చు జంతువుల నేర్తెఱఁజంపి భుజింపు మంచు నా
కిడి పనిగాఁగ శూలధరుఁ డీగుహనుండఁగఁ జేసెన న్నిటన్. 34

వ. అట్లుగాన.

శ్లో. తస్యాల (39)

చ. కరము మహేశ్వరుండు సమకట్టిన నాయశనంబు వేళకున్
సొరిదిగ గోస్వరూప మగు శోణితపారణ ప్రాప్తమయ్యె వా
విరిగను నాఁకటింబడుచు వేదుఱు నాకిపు డైంద వామృతం
బెర గొను నావిధుం దుదున కెట్లటు దృప్తిగనుండె భూవరా. 36

వ. నా కట్లది యగు మఱియు నిగ్గోధనంబు నస్త్రంబుల రక్షింపం
దగు నొండువిధంబు గొఱగాదు యుపాయశూన్యుండ వైన
నీయెడ నది యసమర్థంబుగాదే. 37

శ్లో. సత్వంని (40)

చ. చెనకి యశక్య మైనతఱిఁ జేయఁగఁబోలునె ధేనురక్షసే
యని యధి యేమిటం చనక యందలిసిగ్గువదల్చి పొమ్ము శి
ష్యుని దగుభక్తి నొజ్జపయిఁ జూపినవాఁడవ నీకశక్యర
క్షణమున శస్త్రధారులకుఁ జన్నయశంబునఁ గుందు వేదికన్. 38

శ్లో. ఇతిప్ర (41)

ధ్రువకోకిల. ఇటులఁ బల్కె మృగాధిరాజు మహీధరప్రతిరావ సం
ఘటమహోర్భటితోఁ బరిస్ఫుటఘటనకౌశల మొప్పఁగాఁ
గటుత రోజ్జ్వలితంబులైన ప్రగల్భ వాక్యములనన్ మదా
ర్భటముగాఁ బురుషాధిరాజగు రాజుతో రణితంబుగాన్. 39

—♦ నందిని వదలి తన దేహమును పుచ్చుకొనుమని
దిలీపుఁడు సింహమును ప్రార్థించుట ♦—

శ్లో. ప్రత్యబ్ర (42) శ్లో. సంరుద్ధ (43) శ్లో. మాన్యస్స (44)

క. పలికిన సింహంపుఁ బలుకులు
పలువిని పరమేశ్వరప్రభావము వలనం
గలిఁగెనని శస్త్రవిఫలతఁ
దలఁపఁ డవజ్ఞగ దిలీపధరణీశుఁ డెదన్. 40

చ. స్మరహరుకోపదృష్టివలనం గిరిభేదికిఁ గల్గుదోర్వ్యగ
స్ఫురణముగాని జడ్డువడుచొప్పుఘటిల్లి యిషుప్రయోగదు
ష్కరణవృథాప్రయాసమును గాంచినవాఁ డయి యామృగేంద్రుతో
ధరణిపుఁ డిట్లనున్ వినయధర్మవివేకహితైకభంగులన్ 41

చ. కిసరువిచేష్టలం దొలఁచెఁ గేలసియాడని కట్టుబాటు నా
యసమపరాక్రమంబు పసయాఱినవాఁడనుగా నొనర్చె ని
ట్లొసఁగరితప్పినాఁడ ననునొప్పఁగఁ బల్కిన నాదుమాట పెం
పెసగునె నవ్వుబాటునకు హేతువుగా దొకొ యోమృగేంద్రమా 42

ఆ. అయిన నీవుఁ బ్రాణియాదగ నీయాత్మఁ
బరులయింగితంబు పాడిమెఱిఁగి
నట్టివాఁడ వగుట ననఁ జాలువాఁ డనై
యందు నాదుమాట లాదరింపు. 43

చ. సకల చరాచరప్రతతి సంజననస్థితి నాశనంబులం
బ్రకటముగా నొనర్చును స్వభావగుణంబుల నెవ్వఁ డట్టిహే
తుకపురుషుండు యీశ్వరుఁడు స్తుత్యుఁడు నాకనిశాగ్నిఁ గల్గుమా
మకగురు విత్తమన్యుకడ మార్పడఁ జన్నె యుపేక్షసేయఁగన్ 44

శ్లో. సత్వంమ (45)

చ. సరసకువచ్చుజంతువులఁ జంపిభుజించుట వృత్తియన్న నీ
వెరగొను దీనికిమ్మడిగ నిచ్చెద నాదుశరీర మాత్మఁ బ్రో

బరివిగ నా గ్రహింపక తపస్విగవిం దినకిమ్ము తల్లిరా
కరయుము మహాపురాఁ గనుచు నాఁకసిదూఁడ కుతూహలంబుతోన్ 45

—♦ నందినినివిడిచి నీదేహమును కాపాడుకొనుమని సింహము దిలీపునికిఁజెప్పుట - సింహోక్తికను వాదముగా గుహనుండి ప్రతిధ్వనికలుగుట ♦—

శ్లో. అథాంధ (46) శ్లో. ఏకాత (47)

చ. అనిన హరిస్వరూపుఁ డగు నాపరమేశ్వరకింకరుండు ప
ల్చని నవునవ్వి దంష్ట్రరుచులం గుహచీఁకటిఁ దేర్చు చిట్లనుం
జనునటె నీశరీరమును జాగముసేఁయఁగ నోధనేశ నీ
వెనసితి వొక్క యెల్లిజగమేలిక యౌవనసుందరాంగముల్ 46

ఆ. ఆవును గాదె యవ్వి యఖిలప్రయోజన
సాధకంబులగుట స్వల్పహేతు
వునకు వానినెల్లఁ బోవిడుతే చాలుఁ
దెలియనట్టి వానివలెఁ దలంచి 47

శ్లో. భూతాను (48)

ఆ. అయిన నీవు భూతదయ గలవాఁడవై
యాఁబసింగుఱించి యసువు లిడిన
నిది యొకండెఁ బ్రతుకు నీవుంటివేఁ దండ్రి
వలె సురక్షితముగఁ బ్రజలఁ బ్రోతు 48

శ్లో. అథైక (49)

మత్తకోకిల. ఓ దిలీపనరేంద్ర నీవిటు లూరఁబోవునుపేక్ష నా
వేద నాయఱ నీగురుండు వహించుకోపము మాన్పఁ గా
మేదురంబగు పాలపొద్దులమేటియాల్ పలుగోట్లు నిం
పాదిగాఁ దనకిచ్చి ప్రార్థనపైఁ బ్రసన్నుని జేసె దా 49

శ్లో. తదక్ష (50) శ్లో. ఏతావ(51)

సీ. కావున నీగోవు నీవుపేక్షించిన
స్వర్గహానిగ నెంచవలవ దరయ
సకలవస్తువులచే సంపూర్ణమగురాజ్య
మదియెన్న నైహికంబైనయిందఱ
పదమని బుధవరుల్ వచియించి రటుగాన
నఖిలసౌఖ్యంబుల ననుభవించు
చున్నట్టి ప్రబలత్వ మున్నట్టి నీదేహ
మునురక్షసేయు మీ ముఖ్యముగను
తే. నని యొకింతగ నాహరి వినిచి యూర
కున్న నాగోడగింపున కోలి మాఱు
మ్రోసి యామంచుకొండ ప్రేముడిఁ దదర్థ
మెలమి భాషించె నో యన వెలసె నపుడు 50

—♦ నందిని సంరక్షించుట యావశ్యకమని హేతువులనుడువుచు
దిలీపుఁడు తనదేహమును దానికిబదులుగా పుచ్చుకొమ్మని
సింహమును ప్రార్థించుట. ♦—

శ్లో. నిశమ్య (52)

ఆ. చెప్పి యూరకున్నసింగంబుచేఁ జిక్కి
స్రుక్కి భీతిఁ దన్నుఁ జూచుచున్న
యావుఁ గాంచి తా దయాళుఁడై హరితోడ
మఱలనిటులఁ బలికె మనుజవిభుఁడు 51

శ్లో. క్షతాత్కి (53)

చ. క్షతముననుండి త్రాణము నిగాగ నొనర్చుట క్షత్రశబ్దసం
గతమగు నర్థమౌనుగదె గాంచఁగ దాని సమున్నతార్థముల్
వితథముగా విరుద్ధమగు వృత్తములంబడుతేని కల్గ గ
ర్హితమగుప్రాణముండిన మహీస్థలి రాజ్యమదేల యుండినన్ 52

శ్లో. కథన్ను (54)

ఉ. ఔ నొకవేళ నీవనినయట్టుల మేలగుపాడియావులన్
వానికి నే నొసంగినను వానియమర్షముతీరిపోదు ని
క్కానికిఁ గామధేనువునకంటెఁ గనిష్ఠముకాదు గాన నీ
వేని వశంబె యిట్టిగవి నీడ్వఁగ నీశ్వరశక్తిగాఁ దగున్ 53

శ్లో. సేయంస్వ (55)

క. ఈ తొడుకునకును మాఱుగ
నాతనువుంగొంచు దీని నయముగ విడుతే
రీతిగ నీభుక్తియుఁ జను
నాతని కల యధ్వరక్రియార్థము లేగున్ 54

శ్లో. భవాన (56)

చ. తలఁపఁగ నీవు స్వామిపరతంత్రత రక్షయొనర్పవే దొసం
గెలయక దేవదారువును నిట్టివిధంబిది యంచెఱుంగ నీ
వలె నిదిగాదె నాకును నవశ్యము దీనినిఁ బ్రోవ కేనుఁ గ
న్నశవునఁ జంపి యక్షతుఁడనై గురుముందఱ నెట్లునిల్చెదన్ 55

శ్లో. కిమప్య (57)

మత్తకోకిల. నీకు నాతను వాహరింపఁగ నీవు నామృతికూడదం
చేకమైనఁతలంపుఁజేసిన నెల్లకాలమునుండు సు
శ్లోకదేహమునిమ్ము నీకృప స్థూలదేహ మశాశ్వతం
బైకడుం జెడునంచు మాదృశులైన మర్త్యులు గోరమిన్. 56

శ్లో. సంబంధ (57) శ్లో. తథేతి (59) శ్లో. తస్మిన్క్షు (60)

సీ. నెలయు నెచ్చోనైనఁ గలయుచో జనులకు
సంభాషలనుబట్టి సఖ్యమగుట
మునకిద్దఱకుఁగూడ వనసమీపమునందు
నిట్టి సందర్భంబుఁబట్టి నాకు

నీకునుమాటల స్నేహపాత్రతగల్గె
నాదుయాంఛనుద్రోయ నయముగాదు
యీావును భూతేశభృత్యుండవనినఁ దా
నవునట్లియంచు నగ్గవిని విడిచెఁ

తే. దత్క్షణముననె హరిమహత్త్వంబు వలనఁ
దాంటి నిర్బంధ మదియెల్లఁ దొలఁగిపోయి
యతనిబాహువు లెప్పటియట్ల యాడఁ
బార్థివుం డంత శస్త్రముల్ పారవిడిచి. 57

—♦ సింహముయొక్క అనుమతిచే దిలీపుఁడు
తన దేహమును సమర్పించుట ♦—

తన దేహ మెఱచిముద్దగ
నొనరిచికొని సింగమెదుర నోరిమి నిలువన్
దనపై నుగ్రతఁ బడురీ
తినినుండుటఁ గాంచి సమ్మతింపుచుఁ దానున్. 58

—♦ పువ్వులవర్షము గురియుట నందినీధేనువుయొక్క
అనుగ్రహమును వివరించుట ♦—

క. హరికి నధోన్ముఖుఁడై హరి
యురలకఁగబళింప నూరకుంటయుఁ దనపై
విరివానజల్లు గురిసిరి
వరుసగ విద్యాధరైక పరివారంబుల్ 59

వ. తదనంతరంబ 60

శ్లో. ఉత్తిష్ఠ (61) శ్లో. తంవిస్మి (62)

క. ఓవత్సా లెమ్మనీ విన
గావచ్చెను నొక్కయమృత కలితా లాపం

బాావాక్యము విని యాశ్చ
ర్యావహ మగుచుండ లేచె నవనీశుండున్. 61

వ. అప్పుడు 62

సీ. తన ప్రేమోలఁ బాల్ స్రవింపనిగార మగు ప్రేమఁ
గని తల్లిరీతి నందిని తనర్చి
నిల్చె దృశ్యంబయి నిక్కంబునకుసింహ
మదిగాన రాదయ్యె నంతలోనె
యది చూచి మఱియుఁ జోద్యంబునొంది దిలీపు
తో ననె నందినీధేను విట్టు
లో నరేంద్ర యిదెల్ల నే నొనర్చినమాయ
నినుఁ బరీక్షింపంగ నిజము సుమ్ము

తే. నీవు సత్పురుషుండవే నిక్కమరయ
వరవసిష్ఠముని ప్రభావంబు వలన
జముఁడె ననుఁ గీడ్వడఁగ జేయఁ జాలఁడనఁగ
నిట్టి సింహాదిమృగము లవేమి సేయు 63

శ్లో. భక్త్యాగు (63)

ఉ. వాసిఁ గనంగ నీగురుని పైఁగల భక్తియు నొప్పెఁ జాలఁగన్
వేసటనొంది నీమనసువిచ్చక నాపయిఁ జూపునీదు వి
శ్వాసమదెల్ల నెంతయునుజాలు నిఁకేటికి డీన నీకునా
యాసము లెమ్ము ప్రీతిభరితాత్మనునై కడు నిన్నుమెచ్చితిన్. 64

ఉ. ఏనును బాలునిచ్చుగవినేయనిమెంచఁగఁబోకు నాకుమె
చ్చైనట్టు ప్రీతిగల్గినను నా సురలట్లు వరంబులీయ నెం
తేనిసమర్థురాల భవదీయమతంబుగ నోకుమార మె
వ్వేని వరంబులెన్నికొని వేడుము యిచ్చెద నీకు వేడుకన్. 65

—♦ దిలీపుఁడు పుత్రప్రాప్తి యాచించుట నందిని వరమొసంగుట మొదలగు వివరణము ♦—

శ్లో. తతస్స (64)

మ. తనహస్తంబులతోడ గెల్చుఁగొని శుద్ధఖ్యాతి వీరుండనం
జనువాఁ డర్థులకిచ్చి దాతయన నిచ్చల్ లోకసన్మానముం
గనువాఁడయ్యును దీనమానవువలెం గైసాచివేడెన్ సుద
క్షిణయుం దన్వయకర్తయా సుతునిఁజాగింపంగఁ దానగ్గవిన్ 66

వ. అట్లు దిలీపుండు కుమారుండు గావలయునని కోరి

క. * ఆతం డర్మిలి తోడం
జాతురితా కీర్తిధైర్య సాహసతేజో
పేతుండును నెత్తైఁగునఁ
గాతరతయులేనివాఁడు గావలయునసెన్ 67

శ్లో. సంతాన (65) శ్లో. వత్సస్య (66) శ్లో. ఇత్థంక్షి (67)

వ. నావుడు నందినీధేనువట్లయాఁగాకయని యతనికి సంతానార్థంబు వరంబొసంగి 69

క. ఓపుత్రిక యొకదొన్నెను
నాపాలను బితికిఁద్రావు నావుడు నయ్యా
జ్ఞాపనముఁ దలధరింపుచుఁ 70
దాపసగవికిన్ విధేయతా పూర్వముగాన్

సీ. ఓయమ్మ లేగకు హోమంబునకు విని
యోగింప శేషించి యున్నపాలు
గురు ననుజ్ఞనుజేసి కుడిచెద మద్రక్షి
తావనీఫలము షష్టాంశమట్లు
ననిన దిలీపనరాధిపు విన్నపం బునువిని
విశ్వసించినది యయ్యు

*అధికము

నంగుల కయ్యాపు నత్యంతసంతుష్టి
నొంది యగ్గిరిగుహనుండి లేచి
తే. యశ్రమంబుగ నావసిష్ఠాశ్రమమున
కేగుదెంచెను దోడనున్నృపుడురాఁగ
వచ్చినంతనె యారాజవరుఁడు తాను
నందినీదత్తవరుఁడుగా ముందుగానె 71

—♦ దిలీపుఁడు వసిష్ఠునికొఱకు నందిన్యను గ్రహమును దెలియఁ జేసి సుదక్షిణకొఱకు నయ్యనుగ్రహమును జెప్పుట ♦—

శ్లో. తస్యాంప్ర (68)

ఉ. నందిని సుప్రసాదయుత నవ్యముఖాంతర భావకాంతిచే
నందఱకున్ నిరూఢియయినప్పటికిన్ సరినాఁక తన్మహా
నందమునన్ వసిష్ఠమునినాథునితోఁ దనిఁగొందఁజెప్పె న
న్నందిని యత్యనుగ్రహమునం దనకున్ వరమిచ్చినట్లుగాన్ 72

వ. పిమ్మట భార్యయగు సుదక్షిణాదేవితోడను జెప్పి దిలీపుఁడు నందినీ ధేనువుపాలనుద్రాగుట.

శ్లో. సనంది (69)

ఉ. కుత్సితచేష్ట లేక పుడుకుంగలవాఁడగు నిర్మలాత్మ స
ద్వత్సలుఁ డాయశంబుఁ బరిపాటి సితాకృతి నానినట్లు నా
దిత్స గురుండు దాననుమతింపఁగ నాతఁడు ద్రావె నప్పుడా
వత్స హుతావశిష్టమగుపాలు దిలీపుఁడు నుత్సవంబుతోన్. 74

—♦ వసిష్ఠుఁడు సుదక్షిణాదిలీపులను వారిపట్టణమునకుఁ బంపుట దిలీపుఁడు గురువు మొదలగు వారికిఁ బ్రదక్షిణాదులను జేసి వెడలుట ♦—

శ్లో. ప్రాతర్య (70) శ్లో. ప్రదక్షి (71)

వ. తదనంతరంబు సుదక్షిణా దిలీపులు మఱుచటి దినంబు ప్రాతస్సయమ యుంబున యథావిధి గోసేవంజేసి పారణంబొనర్చినపిమ్మట వసిష్ఠుం

డయ్యుద్దటిదంపతులను నిజపురంబునకుఁబయనంబుసేసి యాశీర్వ
దించిన వారును గమనోన్ముఖులై. 75

చ. హవులను బ్రజ్వరిల్లిన హుతాశనునిన్ వశియా వసిష్ఠునిన్
సతును జేయరాని దగుసాధ్వి నరుంధతినిన్ సవత్సయై
వ్యవసితమైననందినిని నక్కఱతో వలగొంచు మ్రొక్కి సు
క్కివిరి శుభప్రభావు లయి యేగిరి వారల రాజధానికిన్. 76

శ్లో. శ్రోత్రాభి (72) శ్లో. తమాహి (73)

సీ. గతుకులు పడరాని కఱకుటాళ్ళును లేని
తెరువునం బడి రథం బురలిపాఱ
సుమనోభిరామ విశ్రుతముగాఁ జెవులకు
నేమిసంరావముల్ నెమ్మదింపఁ
దనకోర్కెదీరెనం చనుకొని ప్రతనిష్ఠఁ
బడిన యూయూపంబుపడిని బడక
తనధర్మపత్నితోడనుగూడుకొని సహి
ష్ణుతఁగన్నయుల్లాస మతిశయిల్లఁ

తే. జేరె విభుఁడు పురం బటు దారిఁ గడచి
వేడ్కతోడుత నిట్లు ప్రవేశమైన
నెన్నినాళ్ళయి తనుఁ జూడకున్న జనులు
రాగరస మగ్నులయి మొదు రేగి యపుడు. 77

—♦ దిలీపుని పురజనులు చూచుట ♦—

మానివరు నాశ్రమంబున మనికిఁగలిఁగి
తగఁ బ్రిజార్థంబు గోసేవఁ దగిలి కర్శి
తాంగుఁడౌ నలవానిని నాప్తఁ గనిరి
శ్వేతపక్షనవోదయ విధుని బోలె. 78

—♦ మఱల దిలీపుఁడు భూభారమును వహించుట ♦—

శ్లో. పురంద (74)

చ. నిజపురవాసు లెల్లరటు నెమ్మది మోదరసంబుఁ గూర్పఁగా
ధ్వజములు నిక్కఁగన్పడఁగఁ దత్పురి నెల్లెడ నెత్తి నిల్ప భూ
భుజుఁడు పురందరాంశముగఁ బొల్చి ఫణీంద్రసమాన సారమ
ద్భుజమున నిల్పె భూభరము భూరిమహోన్నత వైభవంబులోన్.

ఉ. * మేలుగ రాజ్యసంపదలు మేటిసుఖంబులు భోగరాగముల్
పాలన ధర్మకర్మములు బాటిలుచుండఁగ వైభవోన్నతుల్
సాలఁ గడంగి నివ్వటిలఁ జారుశుభంబులు రాజిలంగఁ బు
ణ్యాలయుఁడై దిలీపనృపుఁ డగ్గలికంబుగ నొప్పె నప్పుడున్. 80

శ్లో. అథన (75)

ఉ. ప్రోథత నింగి యత్రివృశఁ బుట్టినజ్యోతి ధరించినట్లు గం
గాధుని యగ్నిఁ బెట్టినన గాకసు తేజము మోచినట్లు ది
జ్నాథుల తైజసంబయిన గర్భముఁదాలిచె రాజపత్ని త
న్నాథకులైకభూతిపరిణామకుఁడైన సుతుండు భాసిలన్. 81

—♦ సర్గాంతము ♦—

చ. నిరతిశయప్రకాశితవినిర్మలరూపవిలాస లాలసా
వరణవిలూనతావివృతభావనిరంజనతావిశేష భా
స్వరలయకార సృష్టికర సంస్థితివర్తన రూపధారి యీ
శ్వరహరి పద్మగర్భపదవాచ్యదురాసద మూర్తి కల్పనా. 82

క. ఆదివిరాట్పురు షాఖ్యక
మోదరసాన్విత మనోజ్ఞమూర్తిత్రిక స
త్త్వాదిగుణత్రయవర్తి
స్వాదు రసోదయవినోదవాక్యస్ఫూర్తీ. 83

* అధికము

మాలిని

సగుణ విగుణ రూపా సర్వధర్మ స్వరూపా
జగదచపల దార్ఢ్యా జంగమస్థావ రాఢ్యా
సుగతి విధివిధానా సూరిచిత్తావధానా
నిగమ సమితినుత్యా నిత్యకల్యాణకృత్యా 84

గద్య

శ్రీమదక్షరపరబ్రహ్మవందనాభిలాష పరమానందభరిత
మనీషావిశేష మరిచెర్ల వంశపయఃపారావారరాకా
సుధాకర వినుతగుణాకర పరోపకారసూత్రి
శివన్నాయకసుపుత్రి బుధజనవిధేయ
జగన్నాథనాయకనామధేయప్ర
ణీతంబైన రఘువంశమహా
కావ్యంబునందు.
ద్వితీయ
సర్గము.





శ్రీ పరబ్రహ్మణే నమః

# ఆంధ్ర రఘువంశ మహాకావ్యము



## పంచమ సర్గము

శ్రీకలితపుణ్యశీల వి
వేకకలాదృతగుణాతివేల విశిష్టా
నీకవిలిప్సితలసనో
త్సేక కృపాశేష సద్విధేయకలాపా.

శ్లో. ఇతిజి (85) శ్లో. సవిశ్వ(86) శ్లో. స్రత్రాంతే(87) శ్లో. తేరేఖా (88)
[ఇవి చతుర్థ సర్గలోనివి]

వ. ఇట్లు రఘుమహారాజు జయశీలుండై విశ్వజిన్నామకయజ్ఞంబునిమిత్తంబుగ సర్వదిగ్వలయరాజలోకపరాజయం బొనర్చి యేకచ్ఛత్రత్వవిశిష్టుండై యార్జించినసర్వస్వంబును యజ్ఞానంతరదక్షిణలకు నపజయ దుఃఖవ్యపగతులుగఁ బరాజిత రాజవర్గంబులయుఁగరలకుఁగాఁ బంచిపెట్టి సచివసహితుండై సత్పురుషులసహజంబుగ మేఘుండు జలంబుఁ దనకుండక్కయుండవలయునవేయభిలషితంబులేక యొసంగెడివిధంబున నతండంతయు నిశ్శేషంబుగ వ్యయంబుచేసెఁ బిమ్మటఁ దనకుఁబరాజితులైనరాజవర్గంబు నెల్లఁ

దిద్విధూజనంబులచిరవిరహదుఃఖంబులు విరహితంబులుగఁ దమ నగరంబులకుం బోవ సెలవొసంగిన వారలును ధ్వజకలశచ్ఛత్రి రేఖలుగల ప్రసాదసులభంబులగు సార్వభౌముపదంబులకు సాష్టాంగ నమస్కారంబులుచేసి మౌళిమాల్యచ్యుతమకరందధారా ధవళీకృత తత్పాదాంగుళులై చని రట్టియెడ నిర్ధనత్వంబున శూన్యుండైన యవ్విభుండు మృత్పాత్రశేషంబు కడమంగలవాఁడుగ నుండుటయు 2

— ♦ రఘు సమీపమునుగూర్చి గురుదక్షిణకు కౌత్సుఁడు వచ్చుట ♦ —

శ్లో. తమధ్వ (1)

ఉ. కౌత్సుఁ డనంగ విప్రకులగౌరవనీయుఁడు మౌనిసూతి సం
విత్సహితుండు శిష్యుఁడయి వేత్తగు నావరతంతు నొద్ద వి
ద్యాత్సదృశంబుగాఁగ గురుభక్తిఁ జతుర్దశవిద్య లొంది స
ద్వత్సలు నారఘున్ స్వగురుదక్షిణకై తనుఁ జేర వచ్చినన్. 3

—♦ రఘువు యెదురుకొనుట కౌత్సునిగూర్చి రఘువు క్షేమమడుఁగుట ♦—

శ్లో. సమృణ్మ (2)

వ. అంత యశఃప్రకాశుండగు నతండు 4

తే. ఒక హిరణ్మయపాత్ర లే కుండు నతని
కలిమి కులుకఁగ మృణ్మయకలశహస్తుఁ
డగుచుఁ దపసికి సకలున కర్ఘ్య మిడఁగ
నెదురుకొనెఁ బ్రీతి నాతిథ్య మదియెొనర్ప. 5

శ్లో. తమర్చ (3)

తే. వానిఁ గొని యుచితాసనాసీనుఁ జేసి
విధి విధంబుగఁ బూజించె విధివిదుండు
ఘనాసధని కార్యవిదుఁడగు మౌని కపుడు
తాఁ గృతాంజలియై యనెఁ దమి దలిర్ప. 6

శ్లో. అప్యగ్రి (4)

చ. అలఘు కు శాగ్రబుద్ధి వినయంబుఁ గుమారవయోవిలాసముం
జెలువగువర్తనంబు గురుసేవనముం గలయట్టి నీకు ని
వెలయఁ బదార్థబోధ మొలయించినయుష్ణమరీచి మంత్రవే
త్తల కధికుండు నీగురుఁడు తాఁ గుశలంబె తపస్వినందనా 7

శ్లో. కాయేన (5)

తే. గురుత వరతంతుఋషికి నీగురుని కల్ల
మనమునను వాక్కునను దనువునను జేసి
చేయు త్రివిధతపంబులు సెడకిఁ జనునె
యింద్రుఁ డలవానిఁ జెరుప నూహించుఁగాన 8

శ్లో. ఆధార (6)

చ. జతన మొనర్చికట్టిన భృశంబగు పాదులయందునుండి స
త్పుతువలెఁ బ్రోవఁ గాంచి శ్రమఁజోపినయట్టి ఋషీశ్వరాశ్రమ
క్షితిజము లవ్వి దావశిఖిచేతను గాలిభయంబుచేత నో
ప్రతి గజభీతిచేతను నుపద్రవ మొందక యుండునే కదా. 9

శ్లో. నిర్వర్త్య (7)

చ. సతతము పానయోగ్యమును సన్నియమం బగు స్నానయోగ్యమై
పితరులతర్పణంబులను బ్రీతిగదోయుట నెత్తయోగ్యమై
యతిపడుగుర్తుగా నృపషడంశముఁ జేర్చిన యుంఛధాన్యసం
గతమగు సైకతంబులును గల్గిన తీర్థములవ్వి శ్రేయమే. 10

శ్లో. క్రియాని (8)

చ. ఒదవిన యధ్వరక్రియల కొప్పిదమైన కుశచ్ఛదంబు లిం
పెదఁ గొనిమేయఁ బ్రేమఁ గడియింపుచు జాతినబొడ్డుసేర్లఁ బో
మెదఁ బడనీక తాపసులు స్వేచ్ఛ నిజోరులఁ బండఁజేయ న
వ్యోదుగు కురంగశాబకము లెప్పుడు భద్రము తే మునీశ్వరా 11

శ్లో. నీవార (9) శ్లో. అపిప్ర (10)

ఉ. వేళల వచ్చు నయ్యతిథివిందులకుం దమకున్న గ్రాళ్లకుం
బాళులువెట్టు కానవరిఁ బాడొనరింపకయున్న ప్రోల్పసుల్
గ్రాలితి శిక్ష విద్య నుపకారమొ యందఱకోట నీకు నీఁ
గాలమె గార్హపత్య మదిగైకొన నీగురుఁ డాజ్ఞయిచ్చెనే. 12

వ. అనియిట్లు రఘువిభుం డతనికిఁ గుశలం బడిగి. 13

శ్లో. తవార్హ (11)

క. గురు నర్థమునకొ తమ కో
చిరపూజ్యులు వచ్చి రనినఁ జిత్తములోనం
జొర దెలమి కలదు కుతుకము
చిరముగ మీయాజ్ఞ నాకుఁ జేయుట యందే. 14

వ. అని సర్వస్వవ్యయంబుకతన, బేదవడినయాతండుదారంబుగ విలువ
సెడని . వాక్యంబు బలువిడిగఁబలికినను గౌత్సుండు తన
మనంబున. 15

—♦ కౌత్సుండు తనమహిమను వర్ణనఁజేసి ఆయనకు యజ్ఞములో
సర్వస్వమును దానముచేయుటచే ధనములేనందున మఱియొక్క-
దాతయొద్దకు తానుపోవులాగున ప్రత్యుత్తరమిచ్చుట ♦—

శ్లో. ఇత్యర్ఘ్య (12)

ఆ. అతనిరాకయందు నర్ఘ్యంబుఁ గొనివచ్చు
మట్టిపాత్రవలన నట్టెయూహ
చేసి యితఁడు కల్మిసెడి యున్నవాఁడని
యాశవదలె స్వాగ తార్థమందు 16

వ. ఇట్లు నిరాశ చేసుకొని యాతనితో. 17

శ్లో. సర్వత్ర (13) శ్లో. భక్తిప్ర (14)

సీ. ఓరాజ ప్రభుఁడవై యొదవుచు నీవుండఁ
గొదవేమి యెవ్వరి కొదవఁ బోదు

సూర్యుండు గలుఁగంగఁ జూడ్కులఁ జీకటి
లోకులకేమి యా లోకమూని
మఱియుఁ బూజ్యులయందు నెఱపినభక్తి మీ
వంశంబునందున వఱలఁబుట్టె
నావిధం బగుభక్తియందు మీపూర్వుల
కంటెను నధికంబుగలుఁగువాఁడ

తే. వట్టినీకడ కే నల సానుకూల్య
మైనకాలంబుగడచిన పైని వచ్చు
టరయ నా కది విధముగా దనుచు మదిని
వ్యసనపడు చుంటి నని కౌత్సుఁ డనియెఁ బలికి. 18

శ్లో. శరీర (15)

ఉ. దున్నక విత్తకే కలుఁగు దూసరి గున్కులు వర్లు పెక్కులుం
బన్నుగ నవ్వి కాన ఫలవంతము లౌటఁటి సర్వధాన్యముల్
వెన్నులదూసి తీసుకొనఁ బెల్చన దంటులు నిల్చు రీతి నీ
వెన్నఁగ సర్వసంపదలయోగి శరీరము దక్కియుంటివౌ. 19

వ. అయిన నట్టిద యగుంగాక నీయట్టివారలు సర్వస్వంబవశ్యంబగు నవసరంబుల వ్యయింపనొల్లక సత్పాత్రదానంబునకుం గొంకుదురే వృద్ధిక్షయంబులు లెక్కఁగొందురే కావున నిర్ధనత్వంబునఁగొంచు వడినదానఁ గించ నీకువలవ దేమియనిన. 20

శ్లో. స్థానేభ (16)

తే. బహుళపక్ష హిమాంశుబింబంబు తఱఁగి
వృద్ధికంటెను శ్లాఘ్యంబు వేల్పుమొత్త
ములకు వినియోగమున నయ్యె నలముఖార్ధ
మగువ్యయంబది నీకు శ్లాఘ్యంబు గాదె 21

వ. ఇవ్విధంబుగఁ గౌత్సుండన్నియు నతనికి సమ్మతంబుగాఁగఁ బలికి 22

శ్లో. తదన్య (17) శ్లో. ఏతావ (18)

సీ. ఏనన్య కార్యమపేక్షింప మద్గురు
కార్యనిర్వర్తన చర్యఁబూని
తడయ కింకోకదాతఁబడయ నెయ్యెడ నేనిఁ
దడవి యత్నింతు నాగడమువలదు
యలవాన నీరిబొల్లెలమి గ్రోలినచాత
కంబు నిర్గళితాంబు గర్భమైన
ఘనశరత్కాల మేఘంబు యాచించునే
కాలంబు గడచిన మేలుగాదు.

తే. గానఁ బోమెద నీకగుఁ గాతశుభము
యనుచుఁ దాలేవఁ బోయిననాగఁబట్టి
యార్య గురుదక్షిణకుఁ గలయట్టిదేమి
యెంతపరిమాణ మదియని నృపతి యడిగె. 23

(రఘువు కౌత్సప్రయాణము నిలిపి ఏమివసువు ఎంత యివ్వవలసిన దని యడుగుట.)

శ్లో. తతోయ (19)

క. అని యడిగిన విని కౌత్సుం
డను బుధుఁడగు బ్రహ్మచారి యాతండు నిగ
ర్వనితో వర్ణాశ్రమధ
ర్మ ని యామకుతోఁ బ్రవిహితమఖుతో రఘుతోన్. 24

శ్లో. సమాప్త (20)

క. అలఘు చతుర్దశ విద్యలు
నలర సమాప్తముగ నేర్చి యార్యునకు న్నా
వలనం దక్షిణఁ గొనుఁడన
నెలరుచు నీభక్తి సేవలే చాలుననెన్. 25

వ. గురుం డిట్లనిన 26

శ్లో. నిర్బంధ (21)

చ. నృపవర దానినేమి గణియింపకఁ దృప్తిని బొందకే నదే
రెపమున వేడికోలుఁ గడులిప్సమెయిం గురుదక్షిణంబు నీ

జపమొనరించినట్లు తనచక్కటికిం బ్రతిబంధకంబుగాఁ
గృపసెడనంటి నందులకుఁ గృద్ధత నాదగు లేమి చూడకే 27
తే. నావలన విద్య లొందితి వీవుఁ బదియు
నాలుగిఁటి నందు నొకటికి విలుగాను
గోటిపంతునఁ బదునాల్గు కోట్ల ధనముఁ
దెమ్మని గురుండు నాకు విధించె నధిప. 28

—♦ ధనబాహుళ్యము వలన ప్రభువను పేరుమాత్రము నిలుపు
కొనియున్న నిన్ను తొందరపెట్ట నిష్టములేదని కౌత్సుండు
ప్రత్యుత్తరము చెప్పుట. ♦—

వ. అట్లు నేను గురునాజ్ఞఁ జెల్లింపవలయుఁ దన్నిమిత్తంబుగ నాకు
నాశ్రయణీయుండవైన నీవు 29

శ్లో. సోఽహంస (22)

తే. ప్రభుఁ డ వను పేరుమాత్రంబె విభవమునను
గొంచుపడి యున్నవాఁ డవటంచు నాకుఁ
బూజసేయంగ ద్రవ్యంబుఁ బోసికొనుచుఁ
బట్టుకొనివచ్చు మృత్పాత్రఁ బట్టె తెలిసె 30

క. కావున నలవగు విత్తము
గావలయు న్నాకు నలవిగాదు నీకిడం
భావము నిన్నడుఁగుటకుం
బోవదు నాకుల్లసంబుఁ బోవదు దానన్. 31

వ. అని వరతంతు ఋషీంద్రుం డనుటయు. 32

శ్లో. ఇత్థంద్వి (23)

ఉ. ఆజగదేకనాథుఁడు నిజాంగసముద్విజరాజతేజుఁ డు
ద్రాజి ధరారిజేత వృజి నాభిగతిచ్యుతపుణ్యమూర్తి తే
జోజయశాలి తా వ్రతివిదుండగు కౌత్సునితోడ నిట్లనుం
దేజముఁ గీర్తియుంజెడఁగ దెప్పను బొందుట కెవ్వ రొప్పనే. 33

వ. అపవాదంబునకంటె మరణంబు మేలని పెద్దలు వచింతురు గాన.

—♦ నీయర్థమును సాధింప నుద్యమించుదు నని రఘువు నుడువుట కౌత్సుడంగీకరించిన పిమ్మట రఘువు కుబేరుని యొద్దకుఁ బోవ నిశ్చయించుట. ♦—

శ్లో. గుర్వర్థ (24) శ్లో. స త్వ ప్ర (25)

—♦ మంగళమహాశ్రీవృత్తము. ♦—

ఈ నృపతి పేదయని యింతగ నిరాశగొని యీవు నొకదాతకడకుంబో
నీనఁ బడుఁగాదె యొకహీనమగునిందనవహేయముగ నాకునవహేలం
గానఁబడకుండ ననుఁగావుము ప్రయత్నమునఁ గాంతు భవదర్థమొనఁ
గూర్పం
గాన శిఖులున్న మదగారమున ద్విత్రి దినకాలము చతుర్థశిఖిఁబోలెన్
వ. వసింపుమని 36

శ్లో. తథేతి (26)

మ. తనకీఁ జాలిన యర్థసంగ్రహము సేతం బూన్కిఁ జేయం బ్రతి
జ్ఞనమోఘంబుగఁ జేయ నుల్లసముతోఁ గౌత్సర్షి యుండెం ధరి
త్రినిధానంబు గ్రహించియుండుటఁ దదుర్వీద్రవ్యముం బొందనెం
చెను యక్షేశ్వరు నొద్దనుండి రఘులక్ష్మీనాథుఁ డల్లంతటన్. 37

శ్లో. వసిష్ఠ (27)

మ. ప్రథనోత్సాహముతో మహోద్యమముతోఁ బ్రస్థానముం జేయ మున్
బ్రథితుండైన వసిష్ఠమౌని జలము ల్మంత్రించి ప్రోక్షించినన్
రథ రథ్యంబులు తూర్ణమేపఱవఁ బొల్పారెన్ మరున్మేఘుమై
నిధు లుత్తుంగ మహాద్రు లాకసము లన్నింటన్ విశంకస్థితిన్ 38

శ్లో. అథాది (28)

ఉ. ఆరఘువీరుఁడంతట జయాభిరతుండయి యక్షరాజుఁదే
జోరవి రాజమాత్రునిగఁ జూడ్కికి లక్ష్యముచేసి యూతనిం

బోర జయింతునంచు నల్ల ప్రొద్దుసనంగను దేరి యస్త్రముల్
గూరిచి యుంచియుందుఁ దనుఁగూడను గూర్కెనె నంత వేగుటన్

—♦ బొక్కసమువారు బంగారువర్షము కురిసినదని రఘువుకుఁ
దెలుపుట, కౌత్సునికొరకుస్వర్ణరాశి నంతయునిచ్చుట ♦—

శ్లో. ప్రాతఃప్ర (29)

చ. అరయికతోడ మేల్కని ప్రయాణ ముఖుండయియుండునంత స
త్వరముగఁ బర్వులెత్తుకొనివచ్చి విచిత్రముగా మహీశుతోఁ
బొరిగ దివంబు నుండి మనబొక్కసమందున నెక్కసంబుగాఁ
గురిసెఁ బసిండివానయని కోశనియుక్తులు సాటి చెప్పఁగన్ 40

వ. అప్పుడవ్వార్తవిని రఘుమహారాజు కోశగృహంబునెంతకుంజని
యదృష్ట ప్రాప్తంబగు నబ్బలువిక ధనంబెల్లంగనుంగొని యబ్బుర
వడి నిబ్బరంబుగొని. 41

శ్లో. తంభూప (30)

చ. పరువడి నెవ్వనిం బొదువఁ బార్థివుఁ డారయనెంచె నట్టికీ
న్నరపతివల్లఁ దాఁగొనిన నాణెపుటప్పువిఁ బైడి కొండపై
భరముగ వైచినన్ విఱిఁగిపడ్డ సుదంబులెఁ దొంగలించు బ
ల్తరమగు స్వర్ణరాశిఁ దనక్రచ్చుకుహెచ్చుగ నిచ్చె మౌనికిన్ 42

—♦ రఘుకౌత్సులు పురజనాశ్చర్యమునకుఁ బాత్రు
లయినవివరణము ♦—

శ్లో. జనస్య (31)

ఉ. దాత గ్రహీత యొండొరులత్యాగ పరిగ్రహణంబులందు న
ల్లాతని యత్యుదారతయు నర్థిఁదొడంగిన నిస్పృహత్వముం
ద్యోతనమై పరస్పరము దోహలమయ్యె నయారె యంచు సా
కేతపురంబువారలవి కీర్తిమెయింగొనియాడి రెంతయున్ 43

—♦ రఘువును శ్లాఘించి పుత్రుని బొందుమని కౌత్సుఁ డాశీర్వదించుట ♦—

శ్లో. అథోష్ట్రి (32) శ్లో. కిమత్ర (33)

సీ. తన యవసరముగఁ గొనుపరార్థ మదెల్ల
నను కూలపరుప దీకొనియొనర్చి
యలచతుర్దశకోట్ల కనుపమితంబగు
యధికధనంబెల్ల నదియమర్చి
యొగినూర్లతఱఁబడి నొంటెల గోడిగ
గములఁ గట్టించి సాయములఁబెట్టి
పలుమొత్తములమీద బలువుగానెక్కించి
పయనంబునకుసిద్ధమయినవాని

తే. దొట్టి యిష్టార్థమెల్లఁ జేపట్టువానిఁ
దన మనంబు నవోల్లాసమునఁజెలంగు
చున్నవాని ఋషిశ్రేష్ఠు నన్న రేంద్రుఁ
డల్లఁ గని యానతుండయి యలరియుండ 44

సీ. రఘునాథు నిజశరీరము పూని తనకరాం
గుళులఁ దాకుచు ననర్గళముగాఁగఁ
బలికె లౌక్యవిధంబు గలనుడికారంబు
రచన వీనులకెంపొ రుచియొనర్చ
ఘనముగ నయమార్గమున ధనంబార్జించు
టభివృద్ధిసేయుట యదియురక్ష
గావించుటయును సత్కార్యంబులకువిని
యోగించుటయు నాఁగ నోలినాల్గు

తే. రాజవృత్తంబు లవిగల్గురాజులకును
బుడమి యిష్టార్థములనిచ్చు టదియె సహజ

తూకసంబును నీకభీష్టార్థ మొసఁగె
నలవిగానిది నీదుమాహాత్మ్యమెన్న. 45

వ. అనియుచితా లాపంబులఁ గొనియాడి 46

శ్లో. ఆశాస్య (34) శ్లో. ఇత్థంప్ర (35) శ్లో. బ్రాహ్మ్యేము (36)

క. కరి తురగస్యందనములు
విరివిగ రాజ్యాది సర్వ విభవంబులు నీ
వొరసితివి యట్టియాశి
స్సరయఁగ నీకిడఁగఁ బోల దప్రస్తుతమై 47

— లయవిభాతి —

గానశుభగుండవయి గానఁబడునీకు నెనరై సభవదీయపితజానుగన్నునిన్నుం
బోనిపరమార్థపరుఁడై నవరమాన్యుఁడస మానగుణరూపుఁడగుసూనుఁడు మదాశీ
ర్దానమహిమంబునను గానుపగుఁగాతభవదాననసరోజరుచులీనరవిభాతిం
జానపదమందుజనమానసములందునెన లేనియనుమోదములు గానఁబడుచుండన్ 48

— రఘువుపుత్రునిబొందుట అజుఁడనెడి పేరుపెట్టుట —

వ. అని యిట్లు కౌత్సుండవ్విభునకు సుపుత్రుండు గలుఁగవలయునని యాశీర్వదించిపోవం దనయనుమతిఁగొని యతనియొద్దనుండివీడ్కొని సర్వధనంబులతోడ నిజగురుసాన్నిధ్యంబునకుంబోయె నంతఁగతిపయదినంబులు గడచినపదంపడి యలతికాలంబునకుం దనభార్య యందు నొక్క సుదినంబున సూర్యోదయసమయంబున బ్రహ్మదేవతాకంబైన యజనామకముహూర్తంబునఁ గుమారుండునుంబోని కుమారుండుద్భవిల్లిన సంతోషిల్లి రఘువరుండక్కుమారుంగని వికసితవదనుండై యీతండు బ్రహ్మముహూర్తోత్పన్నుండుగాన బ్రహ్మశబ్దపర్యాయంబున నజుండునాఁబరఁగు నని యక్కుమారునికి నామకరణంబుచేసె.

—♦ తండ్రికొడుకులు పోలికమున్నగువానిలో నొకటే రీతిగనుండుట ♦—

శ్లో. రూపంత (37)

ఉ. రూప బలంబులందుఁ దనురుట్స్ని కృతంబులయందుఁ దేజమం
డా పరమోన్నతత్వమునయందుఁ గనంబడు చున్నవాఁడితం
డీపసిబిడ్డఁ డన్నిఁటను నెన్నఁగఁ దండ్రిని బోలియుండి యా
దీపమునందుఁ బుట్టిన ప్రదీపముఁబోలె వెలింగె సామ్యమై. 50

—♦ అజుఁడు యువరాజత్వమునకు తగియుండుట
భోజరాజు స్వయంవర నిమిత్తము దూతను బంపుట ♦—

శ్లో. ఉపాత్త (38)

చ. సుతుఁడు క్రమ క్రమంబుగను శోభిలి యౌవన విద్యలొంద భా
స్వతియగు రాజ్యలక్ష్మి యలవాని వయోవిభవున్ గ్రహింపఁ ద
త్పతికి ననుజ్ఞఁ గోరెననవర్తిలె సుస్థిరకన్య తండ్రి ప్రే
రితము వివాహకాంక్షమెయిఁ బ్రీతిగఁ గోరిన చందమైతగన్. 51

శ్లో. అథేశ్వ (39)

తే. నిండు ప్రాయంబు నెలకొని యుండువాని
నన్నివిద్యల గడితేరి యున్నవాని
నజుని సుజనత్వమును గొనియాడి యల వి
దర్భపతి భోజుఁ డజునెడఁ దమిఁదొడంగి. 52

క. తన చెలియలికి స్వయంవర
మని భువిఁ జాటించి యువతి నలయిందుమతిం
దన కేఁ దలంచి రఘుకడ
కనుమతిగను దూత బనిచె నజు రావింపన్. 53

శ్లో. తం శ్లాఘ్య (40) శ్లో. తస్యోప (41)

చ. పనిచిన భోజుదూత రఘుభర్తకురంగట కేగి కార్యవ
ర్తనగతచర్యయుక్తి భరితంబుగ నిందుమతీ స్వయంవరం

బున పరివర్తనంబు నజుఁబుచ్చఁగఁ గోరుట యెల్లఁ జెప్పఁగా
విని ప్రమదంబు నాదరము పెంపునఁ గన్పడి చర్చితాత్ముఁడై. 54

చ. తన సుతు ప్రాయ మారయుచు దారపరిగ్రహణంబు సేయ నీ
తని కిది యోగ్యకాలమని తామదినెంచి రఘుప్రభుండు పెం
పున మత సంప్రదాయములఁ బోలిన వియ్యము లగ్గటంచు భో
జునిప్రతిఁ గోరిసేయదగు చుట్టఱికంబని యెంచెఁ బల్వురన్. 55

—♦ రఘువు అజునిపంపుట అజునికి త్రోవలో భోజుని
చేఁ జేయఁబడిన సుఖవసతు లుండుట. ♦—

చ. తొనకక భోజభూవరుని తోడను వియ్యమునందఁ జిత్తమం
దున గుఱిజేసి తా నిజసుతుం బనిచెం దనతోడ సేనలం
బనివడి గూర్చి భూపుఁ డలవార్తను దెచ్చిన దూతతోడఁ బె
ల్చనఁగ సమస్తవస్తుబహుళవ్రజపేటికి భోజువీఁటికిన్. 56

చ. కరులు తురంగముల్ భటనికాయము తేరులు గూడఁగాఁ బరం
పరముగ సైన్యముల్ వెడలఁ బొఱఁగ నయ్యజుఁ డేగుమార్గమం
దరిదిగ రాజయోగ్యముగ నయ్యుపచారమహోపపత్తికై
వరుసన భోజరాజు నలవాని సుఖస్థితికై రయంబుగాన్. 57

చ. పఱచిన యెండకై చలువపందిళు లొయ్యన హాయి గొల్ప నే
ర్తెఱయగు విప్పునన్ బటకుటీరము లెండకు వాన కోర్వఁ జే
కుఱిచె విహారయోగ్యముగఁ గోమలపల్లవవృక్షవాటిఁ జే
కుఱుఁ దగఁదీర్ప నీర మనుకూలపదార్థములున్ శయాదులున్. 58

—♦ అజుఁడు నర్మదాతీరములో సేననుంచుట. ♦—

శ్లో. స నర్మ (42)

క. విరమింపకఁ గొంతగు ద
వ్వరిఁగి రఘుక్ష్మాప సూనుఁ డటఁ గనుఁగొని యెన్
నర సురమునిజన శర్మద
నరసుర నిర్మదయునైన నర్మద నంతన్. 59

చ. విరిసిన క్రౌనుఁ గుల్ పరిఢవిల్లిన తత్తటియందు నర్మదా
సరి దుదశీకరార్ద్రిమయి చల్లఁగమారుతముల్ చరింప భూ
వర సుతుసేన తద్గమనపాత పదోత్థరజోవికీర్ణ ధూ
సరితపతాకమై విడిసె సాగకడస్సిన విశ్రమింపఁగన్. 60

వ. అజుం డట సేనలఁ బ్రవేశింపఁజేసి యూరటఁ గలిఁగియుండునంత 61

—♦ నర్మదానదిలో నుండి అడవియేనుఁగు లేచుట
మొదలగు వ్యాపారము. ♦—

శ్లో. అథోప (43)

క. ఆ నర్మదయం దొక యెడ
వేనుఁగు గండస్థలమున నీరితమదముం
బానముసేయఁగ ఝుంకృతి
గానముతో నచొట నళినికాయము దిరిఁగెన్. 62

క. భృంగంబులు దిరుఁ గాడిన
భంగిన మొనరాకమున్నె వ్రంతను వనమా
తంగము మునింగియుండిన
సంగతి తెలియంగఁ బడఁగఁ జయ్యన లేచెన్ 63

వ. అట్లవ్వనగజంబు జలంబులలోనుండి మీాదికిలేచి 64

—♦ దండునందలి గజశ్రేష్ఠములయొక్క తిరుఁగుబాటు
మొదలైన దండుపాళెపు కలకలము. ♦—

శ్లో. నిశ్శేష (44) శ్లో. సంహార (45) శ్లో. శైలోప (46)

సీ. అలవృక్షవత్సర్వ తాశ్మవప్రములందుఁ
గోరాడు కొమ్ములఁ దేరుగీఱ
లవి దోప. ధాతుశి లాత్తచిత్రాంకముల్
తరఁగనీరులఁదోఁగి యొరసిపోవ
వఝ్రోడుజలముల నుజ్జాడు కడువున
మదజలరేఖలు మాసిపోవఁ

గడుఁ దేఁటిచెక్కిళ్లు గన్పట్టఁ దొండంబు
సాచుచు ముడుచుచు జలములెల్లఁ
తే. జెదరఁ బాదుచు శైవాల మదివెలార్చి
గప్పనను గొండవలెఁ దోచి చప్పుడిలఁగ
గదిసి సైన్యేభములకట్టుకంబములను
విఱచునదిపోలె యొడ్డున కుఱికిపడియె 65

శ్లో. తస్యైక (47) శ్లో. సప్తచ్ఛ (48) శ్లో. సచ్ఛిన్న (49)

సీ. తటినీతరంగనదప్రవేశంబున
నిజగండముల మదనిస్సృతి కడుఁగఁ
బడి సైన్యగజములఁ బొడఁగాంచుటను నవ్య
ముగ మదస్రావంబు మగుడఁగలిగెఁ
సప్తచ్ఛదక్షీర సౌరభంబును బోలి
కడలొత్తి సత్త్వావివెడలదాని
రాజేంద్రగజము లాఘ్రాణించి సహియింప
కలదాని వీక్షించి కలయఁబాఱి
తే. మావటీండ్రంత బిగఁబట్టి మట్టుపఱుపఁ
బట్టువడకేచె నశ్వముల్ కట్టుపగ్గ
ములను ద్రెంపుచుఁ బాఱెఁ దేరు లవి యిరుసు
లవిసి విఱుఁగంగఁబడెఁ గరి యవల కుఱుక 66

క. అప్పుడు దమయువతుల నా
ముప్పునఁ బడనీకఁగావ మూఁగి భటుల్ వా
రొప్పు కొనరైరి యొండొరుఁ
జెప్పక పటి యఱచి పఱచెఁ జెల్లాచెదురై 67

—♦ ఆయేనుఁగుపై యజుఁడు బాణము వేయుట ♦—

శ్లో. తమాప (50)

ఆ. అట్టి యవసరమున నజమహారాజు య
య్యడవి యేన్గుఁగాంచి యనితలంబు

నందుఁ దక్క నేన్గు నవ్యస్థలంబునఁ
జంపఁగూడదనెడి జంకుఁగలిఁగి 68

క. ఆయెడ శ్రుతవంతుఁడు కరి
డాయుచు గండస్థలము గడాఁ బోవఁగ నీ
కాయమువిడి యేసె నన
త్యాయతి నాకృష్టశార్ఙ్గుఁడై యొకములికిన్ 69

—♦ ఆయేనుఁగు గంధర్వశరీరమును బొందుట గంధర్వుఁడు తనకు శాపము సంభవించుటయును దానివిమోచన రీతియును నుడువుట ♦—

శ్లో. సవిధ (51) (52) (53) (54) (55) శ్లో. సమ్మోచి (56)

వ. ఇట్లెదురుగ నరుఁగుదెంచు నవ్వనగజంబును వెనుకకుఁ గ్రమ్మఱింపం బవరి యయ్యాజంఁడు దాని కుంభస్థలంబున నేయ నయ్యేనుం గయ్యెటువడిన తోడన గజరూపంబువిడిచి పరిజనంబు లచ్చెరువడి సూచుచుండఁ దేజఃపుంజంబుగల యాకసంబునందు సంచరించు మనోహరంబైన దివ్యస్వరూపంబునుం బొందె నప్పుడట్టి తన దివ్యప్రభావంబుకతన నతని కురంగటకుఁ గల్ప ప్రసూనంబులు రప్పించి యప్పతిపయిం గురిసి నిజోరస్థల తారహారంబు లతిద్యుతి మంతంబులుగఁ బలుకాంతి పూరంబు వెలువరింపుచు వక్తృత్వంబు మెఱయ నద్దివ్యపురుషుండు నిజవృత్తాంతం బంతయుఁ దెలుపం దొడంగె రాజేంద్రా వినుము నేనుఁ బ్రియదర్శనుం డను పేర నాహూతుండైన గంధర్వరాజునకుం బుత్రుండఁ బ్రియుం వదుండను నామంబునఁ జెలంగువాఁడ నట్టి నాకు. 70

ఉ. నాదగు గర్వకారణమునన్ ఋషియైన మతంగమౌని యా
పాదిలఁ జేసె నీయెడ ద్విపత్వముఁ బొందుమటంచు శాపవి
చ్ఛేద మొనర్ప వేడుకొనఁ జిత్తమునందు దయార్ద్రభావముం
బాదుకొనంగఁ జేయుచు నుపాయమొనర్పఁగఁ బల్కె నాతఁడున్,

ఉ. నాకు నయించి యేనుఁ గడునమ్రుఁడనై యిదె మ్రొక్కులంది యి
క్ష్వాకుకులైకసంభవుఁ డజక్షితిపుండిట నెట్టకేని తా
రాక గనంగ నీకగుఁ జలంబున నాతఁడు నీకుకుంభమం
దేకశిలీముఖంబు వడినేసిన శాపవిముక్తి యాననెన్. 72

ఆ. అగ్ని నాతపమున నత్యుష్ణమును బొందు
జలము చల్లఁబడిన చందమునను
ఋషు లమర్షులైనయెడను నల్లంతన
శాంతులగుట వారి సహజగుణము. 73

—♦ గంధర్వుఁడు ప్రత్యుపకారమయిన సమ్మోహనాస్త్ర
మును స్వీకరింపుమని యజుని ప్రార్థించుట. ♦—

చిరకాలంబుననుండి నీకయి నిరీక్షింపంగ నీదర్శనం
బురుసత్త్వుండ వొసంగి చేసితివి నాకుర్వీశ శాపచ్యుతిం
బరమార్థంబయె నీకు నాపదవియున్ వ్యర్థంబుగాకుండఁ ద
త్పరతం బ్రత్యుపకారమే నొనరుపం భద్రంబు రాజోత్తమా. 74

శ్లో. సమ్మోహ (57)

శా. వీరాగ్రేసర యోసఖా గొనుము సంప్రీతిం బ్రయోగోపసం
హారంబుల్ విశదంబులై తగుట కత్యంతంబు గాంధర్వమం
త్రారంభస్ఫురితంబుగా నొసఁగెదం బ్రార్థించి సమ్మోహమన్
పేరుం గల్గినయస్త్రమున్ జయము చేఁబట్టున్ రిపుచ్ఛేదమై. 75

శ్లో. అలంహ్రీ (58)

ఆ. నన్నుఁ బరుసఁదనమునను బ్రహరించితి
ననెడులజ్జ నీవుఁ గొనకు నీదు
కనికరమున నిట్టిపని యుపకారమై
మేలె యొదవె నాదు మేలుగొనుము 76

వ. అతండట్లనుటయు విభుండువల్లెయని 77

—♦ అజుఁడు సమ్మోహనాస్త్రము స్వీకరించుట ♦—

శ్లో. తథేత్యు (59)

మ. అల సోమోద్భవయందు నాచమనకృత్యంబల్లనం దీర్చి ని
ర్మలుఁడై యాతఁ డుదఙ్ముఖంబుగను దన్మంత్రాప్తియుంగాంచి రా
జ లలాముం డజుఁ డస్త్రకోవిదుఁడు నాసమ్మోహనాస్త్రంబుఁ బు
ష్కలశాపచ్యుతుఁ డా ప్రియంవదుఁ డొసంగంగైకొనెం దిగ్గనన్ 78

—♦ అజుఁడును గంధర్వుఁడును వెళ్ళిపోవుట ♦—

శ్లో. ఏవంత (60)

క. అప్పగిది వారికిద్దఱ
కప్పథ మధ్యమునఁ దలఁపనట్టి తలంపై
యొప్పుగ విధియోగఁబునఁ
జొప్పడి సన్మైత్రియొదవెఁ జోద్యముగాఁగన్ 79

క. పిమ్మటఁ బ్రియంవదుఁడు పయ
నమ్మయ్యెనుఁ జైత్రరథమునకు నలపతియున్
నెమ్మిగఁ దరలుచుఁ జేరెను
నమ్మయి సౌరాజ్యరమ్యమైన విదర్భన్ 80

—♦ భోజుఁడజునెదుర్కొనుట ♦—

శ్లో. తంతస్థి (61)

చ. అనఘుఁడజుండు భోజనగరాంతికమందుఁ బ్రవేశమైన నా
తనిఁగని రాకకుఁ బ్రమదంబునుఁబొంది యెదుర్కొనెన్ హిమాం
శుని ఫలదూర్మికానికర శోభితవర్తనుఁడై తదాగమం
బున నలసాగరుండువలె భోజనృపాలుఁడు నయ్యజప్రభున్ 81

—♦ భోజుఁడజుని కుపచరించుట ♦—

శ్లో. ప్రవేశ్య (62)

చ. అతఁడు పురఃప్రవర్తియయి యాతనివీఁటికిఁ దోడి తెచ్చి న
మ్రతఁ దనసర్వసంపద సమర్పణఁజేసె సగౌరవంబుగా

నతనికిఁ గౌరవాన్వయమునందున గౌరవవంతుఁడై సుసం
గతిఁ గలవాఁడునై సలిపెఁ గౌరవముం గ్రథకైశికేంద్రుఁడున్ 82

చ. అజపతి భోజభూరమణుఁ డగ్గసరుండయి దోడి తేరఁ బ్రో
ల్పజ లలవారలంగని తలంచిరి భోజునిఁ గ్రొత్తవానిఁగా
నజు నిలుతేనిఁగాఁ దలఁచి రాత్మను దన్ను పచారవంతుఁగా
ఋజువుగ నమ్మహీశుఁ డొనరించుట నయ్యది కారణంబుగాన్. 83

—♦ అజునికి ఇందుమతీవిషయిక చింతచే చాల ప్రొద్దుకు
నిదుర పట్టుట. ♦—

శ్లో. తస్యాధి (63)

ఉ. ఆరఘువీరకల్పుఁడగు నాతఁడు భోజనియుక్తులై సమ
స్కారసమర్పణంబు లధికారు లొనర్చి యొనర్ప నొక్కప్రా
గ్ద్వారవిశాలవేద్యపరిభాగ్యసుకుంభ లసన్నవాధిపా
గారమునం బ్రవేశమయెఁ గాముఁడు నవ్యవయోదశంబలెన్. 84

శ్లో. తత్రస్వ (64)

ఆ. ఆ స్వయంవరార్థ మరుదెంచి వచ్చిన
కువల యేశులకును గోరఁ దగిన
కన్యకాలలామఁ గామించిపొందంగఁ
దనుకుచున్న హేతు వునను బతికి 85

క. ఆరేయందున నిద్దుర
పూరుషునుద్దేశ మెఱుఁగఁ బోలని ప్రియురాల్
దూరము తడయుచుఁ జేరఁగఁ
దారుచుగతి డగ్గఱించెఁ దనకను గవలన్. 86

వ. అతం డతని కిడిన విడిది యందు రాత్రి శయ్యాతలంబునఁ బరుండి
తన మనంబున నిట్లయ్యిందుమతీ స్వయంవరంబున నక్కన్నియం
బడయునూహాలంబడి యాలస్యం బొదవెడు నిద్రం జెందె నంత
ప్రాతస్సమయం బగుడు. 87

—♦ బట్టువా రజుని లేపువర్ణనము ♦—

శ్లో. తంకర్ణ (65)

సీ. నవకర్ణభూషలు నడయాడి రాయంగఁ
బడిన యెత్తగు భుజద్వయమువానిఁ
దన్వంగి పొందుఁగూడకె శయావస్త్ర ము
ర్దన నూడు మేని గంధంబు వానిఁ
ప్రథితప్రబోధన ప్రతిభానిరూఢిమై
మెలకువచే మించి మెలఁగువాని
జనకప్రతిగ ధాత్రిని బాలనముసేయఁ
గను బ్రహ్మచే సృష్టిగన్నవాని

తే. నజమహారాజు నవయుష్కులైనయట్టి
వందిపుత్రులు వాచకార్భటులు సెలఁగ
మేలు కొలుపంగఁ దొడఁగి రమ్మెది నీవు
నధిప తెలవారె లేవఁగ దయ్య యనుచు. 88

శ్లో. రాత్రిర్గ (66)

సీ. రాజాధిరాజ విరాజమానబిడౌజ
యజమహారాజ సద్విజయ భోజ
యఖిలజగద్భార మంతయు మోవంగ
నీతండ్రికిని మఱి నీకుమోపి
ద్వివిధంబుగా బ్రహ్మ విభజించి మిమ్ముల
సృజియించె నిప్పు డశృంఖలముగ
నీతండ్రి రఘువీరుఁ డాతం డసుప్తిమై
రాజ్యంబుపాలన రమణఁజేయు

తే. చున్నఁవాఁడింక నీవును జిన్నవాఁడ
వన్న యువరాజపథమున నున్నవాఁడ

వపరధుర్యపదాభి నవావలంబ
నాభిమతుఁడవు లెమ్ము మహాత్మ నీవు 89

శ్లో. నిద్రావ (67)

సీ. నీవు నిద్రాయుత తీవశవర్తివై
యుండఁ బూరుషుఁ డన్యయువతిఁగూడి
యుండుట కల్గినఖండితనాయిక
రీతి లక్ష్మియుఁగూడ రేయి యందు
వేఱుగతింగాన వెరవిడి నీముఖ
సామ్యంబునొందినఁ జంద్రుతోడఁ
గూడి వినోదంబు లాడెడు నింకేటి
కని సిగ్గునంబోలె యాశశియును

తే. నహహ నీముఖశోభను నల్లవిడిచి
యతఁడు వెలవెలఁబాఱి యస్త్రాద్రికరిఁగెఁ
గానఁ దెలవాఱె నింకయున్నైన మేలు
కొనుము నీరాజ్యలక్ష్మిఁ జే కొనుము దేవ 90

శ్లో. తద్వల్గు (68)

చ. చల దుదరద్విరేఫమగు సారసమున్ సుమనోజ్ఞమై సము
త్కలికఁ జలత్కనీనికలు గల్గిన నీకనులుం గడిందితోం
గలి గొనుచున్న మోముపులవికాసము నొక్కవడిం జెలంగుచున్
లలి నిపుడొందె నయ్యవి పరస్పరముం బరిపూర్ణసామ్యమున్. 91

శ్లో. వృంతాచ్ఛ్ల (69)

ఉ. వైరివిదారి నీదగుస్వభావగతంబుగ సిద్ధమైన ని
ట్టూరుపుసౌరభంబును గడుంగడుఁ దొట్టఁగఁబోవ నెంచి వి
స్తారముగాఁ దరుప్రసవతండమునూడ్చుచు సూర్యరుక్ స్ఫుటీ
కారిత వారిజానుగతిఁగాంచుచువీచెఁ బ్రభాతవాయువుల్. 92

శ్లో. తామ్రోద (70)
తే. మ్రాని కెంజిగురాకుల రాలిపడిన
ముత్యములఁ బోనిమంచుబొ ట్లత్యయముగ
నీదువాతెఱపలుగాంతి నెఱయఁబాఱి
వఱలు చిరునవ్వువలెఁ గను మెఱయుచుండె. 93

శ్లో. యావత్ప్ర (71)
తే. తేజసాంరాశి రవి కడల్ తెఱచిపొడము
నింతలోఁదోఁచి యరుణుండు ధ్వాంతమెడపు
రమణ నాయోధనాగ్రేసరత్వబిరుద
మొంది నీవుండ నీతండ్రి యున్ననేమి. 94

శ్లో. శయ్యాంజ (72) శ్లో. దీర్ఘేష్వ (73)
సీ. వనజాక్ష మీయిరు ప్రక్కలయందున
నిద్రించి లేచి యేనికలు కట్టు
గొలుసులు నవి గలగల యార్పుచున్నవి
యెఱ్ఱని శేయెండ యెలరుసోకి
వానిదంతంబులు వడిఁ గొండచఱియలఁ
గోరాడ ధాతుశిలారుణంబు
నొలసినయ ట్లవ్వి వెలయుచు నున్నవి
పటగృహంబులఁ గట్టఁ బడినయట్టి
తే. యల వనాయుజతురగంబు లవియు నిద్ర
లేచి ముందఱనిడియున్న లేహ్యమైన
చారుసైంధవలవణాశ్మశకలములను
నాకుచున్నవి యదె రఘునాధపుత్ర. 95

శ్లో. భవతి (74)
తే. వాఁడెఁ బూజల నిడుపూలు పలుచనగను
దెల్లఁబాఱెను దివ్వెల దీప్తి తఱఁగి

మేల్మి మీగూటిచిలుక మీ మేలుకొలుపు
కొఱకు మాపల్కు నుడుల వాకొనియెం దొట్టి 96

—♦ అజుఁడు పాన్పునువదులుట ♦—

శ్లో. ఇతివి (75)

తే. లేచె నిటువందిపుత్రులు లేప శయ్య
నుండి పతి గాంగసికతలనుండి యల్ల
మధురమగు రాజహంసగానముల చేతఁ
దెల్వికొని లేచు నాసుప్రతీకమట్లు, 97

వ. అట్లజుండు స్తోత్రపాఠంబుల వలనం బ్రబోధితుండై. 98

—♦ అజుఁడు స్వయంవరమంటప మందుండెడి
రాజసమూహమును బొందుట ♦—

శ్లో. అథది (76)

క. మెప్పుగను రాజనందనుఁ
డప్పుడు కాలోచితక్రియల్ దీరిచి కొం
చొప్పుగ శుచియయి రుచిమెయి
నప్పె స్వయంవరనిమిత్త నైపథ్యంబున్. 99

వ. అయ్యాజకుమారుండు స్వయంవరోచితంబగు ముస్తాబువైచికొని.

తే. రత్న చీనాంబరాది విరాజితముగ
రాజ తేజితకీర్తి విరాజమాన
మూర్తియయి యాస్వయంవరమునకుఁ గూడు
కొనిన నృపలోకమును జేరుకొనియె నంత. 101

—♦ సర్గాంతము ♦—

ఉ. విశ్వకర ప్రధానగుణ విశ్వనివారణ విశ్వకారణా
విశ్వవివర్ధ నోద్ధరణ విశ్వవిదారణ విశ్వధారణా
విశ్వవివర్తనాచరణ విశ్వవిచారణ విశ్వపూరణా
విశ్వ నిరంత రాదరణ విశ్వ విభూషణ విశ్వపోషణా. 102

క. అణిమాది విభూతిస్థిర
గణనా త్రిగుణాత్మికా ప్రకల్పిత భువన
క్షణికసుఖరహితచరణా
ప్రణిధానవిచక్షణైకభరితాత్మవరా. 103

మాలిని

జగదవన నిరాసా సత్యవాక్యాధివాసా
నిగమవినుత భావా నిష్కళంక ప్రభావా
ఖగ విహరణ శీలా కర్మనిర్మాణ లీలా
ప్రగళిత గుణ లేపా ప్రత్యగాత్మస్వరూపా 104

గద్య

ఇది. శ్రీమదక్షరపరబ్రహ్మవందనాభిలాష పరమానందభరిత
మనీషావిశేష మరిచెర్లవంశపయఃపారావారరాకా
సుధాకర వినుతగుణాకర పరోపకారసూత్రి
శివున్నాయకసుపుత్రి బుధజనవిధేయ
జగన్నాథనాయకనామధేయప్ర
ణీతంబైన రఘువంశమహా
కావ్యంబునందు.
పంచమ
సర్గము





శ్రీ పరబ్రహ్మణేనమః

# ఆంధ్ర రఘువంశ మహాకావ్యము



## షష్ఠ సర్గము



శ్రీ కైవల్య పదాశ్రయ
సాకల్యవివేచనప్రశస్తవిచార
స్వీకారభావ నాసదృ
శ్రీకారవిలాస సుప్రసిద్ధవికాసా,

వ. అట్లు రఘుసూనుం డుపచారభరితంబగు రాజవర్గంబుగల స్వయం
వరస్థానంబునందుఁ బ్రవేశించి 2

—♦ అజుఁడు మంచల యందుండెడి రాజసమూహమును జూచుట ♦—

శ్లో. సతత్ర (1)

మ. చెలువంబై తగు నెత్తుమంచములపై సింహాస నాసీనులై
కొలువై యుండిన యన్న రేంద్రుల బెడంగుం దివ్యమై తోఁచి వే
ల్పులు వైమానికులై బయల్పడిన చాడ్పుం గన్నయట్లున్న వా
రలఁ గాంచెన్ రఘునందనుండు సురలీలావిస్ఫురద్వేషులన్. 3

—♦ రాజులకు అజుని జూచుటచే యిందుమతియందు
నిరాశత్వము గలుఁగుట ♦—

శ్లో. రతేర్గృ (2)

చ. హరుచేతన్ హతమైనమేను సతి తన్నర్థింపఁగాఁగాంచి నూ
త్నరుచిం దోచినమన్మథుండువలె నాతండల్లయాస్థాన గో
చరుఁడైనంతనె గాంచి యిందుమతిపైఁ జాలించి రయ్యాశ ల
య్యారె రారాజులె యెల్లఁబోయిరిగదా యారాజుతోఁబోలమిన్. 4

వ. అల్లంత 5

—♦ అజుఁడు మంచె నెక్కుట ♦—

శ్లో. వైదర్భ (3)

మ. అల సోపానపథంబునన్ వెడలు సామ్యంబై నిరాతంకచ
ర్యల సింహార్భక మశ్మచంక్రమణలీలంజేసి శైలాగ్రమె
క్కులలిన్ రాసుతుఁడెక్కె స్వీయపదవల్గుస్ఫూర్తి వైదర్భ రా
జ లలామవ్యపదిష్టమంచముపయిన్ జంగక్రమ మావేశుఁడై.

—♦ ఆరాజసమూహముయొక్క శాంతిస్వరూపవర్ణనా
పూర్వకముగ ఆరాజసమూహమధ్యగతుఁడైన అజుని
యొక్క ప్రకాశాధిక్య వర్ణనము ♦—

శ్లో. పరార్థ్య (4)

ఆ. నీల పీతవర్ణ నిర్మాణవైచిత్ర్య
రత్నకంబళాస్తరణము గలుఁగు
రత్నఖచితపీఠి రహియించు రఘుసూతి
నెమ్మి మీఁదికోమరు నిభము గనియె.

శ్లో. తాసుశ్రి (5)

ఉ. ఆ నృపశేఖరుల్ వరుసలై కొలువుండిన యాస్వయంవర
స్థానమునందు నొక్కొకరి చాయలవన్నియుఁ గూడి యేకమై

జానుపడెన్ మొగుళ్ళవరుసం బ్రభవించిన దుర్నిరీక్ష్య తే
జో నిచయోదయంబుగల చొక్కపుమించుగఁ బిచ్చలింపుచున్. 8

శ్లో. తేషాంమ (6)

చ. సురుచిర నూత్న వేషయుత శోభితమూర్తులు తేజరిల్లఁగా
హరువుగ సింహపీఠములయందుఁ దనర్చిన రాజులందు రూ
పరిగ నజప్రభుం డతిశయప్రభనొప్పె సురద్రుమాళి మే
దురముగఁ బారిజాతతరుతుల్యముగా సవిశేషమూర్తియై. 9

శ్లో. నేత్ర వ్ర (7)

తే. పురజనంబులచూడ్కు లాపుడమిదొరల
వలను వీడ్కొని యజునిపైఁ బడె సుమద్రు
మములపై వ్రాలు తేఁటులు మదఁపుఁ జేన్గు
గానఁబడ దానిపైఁ బడి యానినట్లు. 10

—♦ బట్టువారిస్తుతి మంగళవాద్యములు మొదలైన శుభములు
ప్రవర్తించుకాలములో నిందుమతి మంచమధ్యమమునఁ
బ్రవేశించుట. ♦—

శ్లో. అథస్తు (8) శ్లో. పురోప (9) శ్లో. మనుష్య (10)

వ. అప్పుడు వంది మాగధజనంబులు సూర్యచంద్రవంశంబులం బుట్టిన రాజవరులవంశంబులం బొగడెడి యార్భటులు సెలంగెఁ బతాకంబుల స్పృశించుచు నగరుధూపంబు లెల్లెడలం బ్రసరింపుచుండె శంఖధ్మానంబులు మంగళవాద్యంబులు దిక్కులయం దంతట మిక్కుటంబుగ మ్రోసెఁ దద్ధారవంబులు మేఘారవంబులని సంస్మరించి తత్పురోపకంఠోపవనస్థిత నీలకంఠంబు లుత్కంఠ నృత్యంబు లొనర్చుచుండె నట్టియెడ స్వయంవరనిమిత్తంబు కల్యాణోచిత వేషయు నానాలంకారభూషితయునై యగణ్య లావణ్య రూప విలాసంబున నయ్యిందుమతీదేవి మనుష్యవాహ్యంబైన యొక్క చతురంతయానం బధిరోహించి పరిజనసమేతయై స్వయంవరస్థానం

బున కరుఁగు దెంచి యమ్మంచంబుల మధ్య రాజమార్గంబునం బ్రవే
శించె నప్పుడు

—♦ యిందుమతియందు రాజసమూహము యొక్క-
చిత్తములు లగ్నమగుట. ♦—

శ్లో. తస్మిన్వి (11)

క. ఆకన్నెరూపు నేత్ర శ
తైకాలక్ష్యముగ బ్రహ్మ సృష్టించుట నా
భూకాంత సుతుల్ గాంచి ప
రాకుపడిరి మేను లాస్తరణముల నుండన్. 12

—♦ రాజులు నానావిధములుగఁ జేసిన శృంగారచేష్టలవివరణము ♦—

శ్లో. తాంప్రత్య (12)

క. వారల మనోరథము లే
పారం దమ ప్రార్థనములు స్పష్టపఱచు శృం
గారవిచేష్టలు పొడమెను
భూరుహముల కిగుళు లట్లు భూపసుతులకున్. 13

శ్లో. కశ్చిత్క- (13) శ్లో. విస్రస్త (14) శ్లో. ఆకుంచి (15)

సీ. అక్కన్య తన్నుఁ బెండ్లాడి భ్రాంతిల జేయు
ననెడి యూహలకు సూచనముగాఁగ
నొకరాజు తమ్మిపూ వొకటి నాళముచేతఁ
గొని విలాసార్థ మూఁకొనుచుఁ ద్రిప్పు
నీరీతి నిందుమతీరామతో లీల
లొనరింతు ననుమదియునికి దోపఁ
దన మొగంబటుఁ ద్రిప్పుకొని యంగదమునఁ గీ
ల్కొనుసరుల్ చెయి సర్దుకొను నొకండు

తే. మఱియు నింకొకభూపుఁ డమ్మగువ నతని
దండవర్తింప రమ్మను తలఁపుఁగాఁగఁ

గొంచెముగాఁ జూడ్కిఁ బ్రాల్చి యాకుంచితమగు
కాలికొనగోట భూవిలేఖన మొనర్చు. 14

శ్లో. నివేశ్య (16)

ఉ. అంగనతోడ ముచ్చటల నాడెద నన్మది వెల్లడింప వా
మాంగసమున్నతంబు చెలువారఁగ వామకరంబుఁ గ్రిందియో
రంగడు నూని కుత్తుకసరంబు త్రికంబునఁ బొర్లియాడఁ బ్ర
క్కఁగల యాసుహృజ్జను ముఖస్థముగా నుడు లాడు నొక్కఁడున్.

శ్లో. విలాసి (17)

చ. మఱియొక కోడెకాడయినమానవనేత నితంబినీరతిం
దెలివపిఱుందులన్ నఖహతిం బొనరించినవాఁడె యాట నీ
తెలివపిఱుందులన్ నఖహతిం బొనరింతునటన్నభంగిఁ గ
న్గిఱపుచు దంతపత్రనిభ కేతకబర్హముఁ జీరుఁ గోరులన్. 16

శ్లో. కుశేశ (18)

ఉ. ఈ లలితాంగిఁ గూడుకొని యాగతిఁ గ్రీడలనుల్లసిల్లఁ బ్రా
ల్మాలక నాడుకొందుననుమాడ్కిఁ గ లోఁజెయి నాధ్వజాదిరే
ఖాలిపి యంగుళీయకరకాంతులు ప్రేళుల వ్యాప్తిఁ బొందఁ గెం
గేలఁ గుశేశయద్యుతులు గీల్కొనఁ బాచిక లాడునొక్కఁడున్ 17

శ్లో. కశ్చిద్య (19)

చ. తనదుకిరీట మెప్పటివిధంబుగనుండిన నైన దానిరీ
తిని జులుకంగ నీవరసతిన్ వహియింతు నటంచు నెంచి యొ
య్యన రతనంపుఁ జాయలు కరాంగుళిరంధ్రములందుఁ బర్వ మౌ
ళిని సవరించుఁ దా నొక ధరిత్రివిభుండు విలాసమొప్పఁగన్. 18

శ్లో. తతోనృ (20)

క. ఇప్పగిదిఁ బుడమిఱేఁడులు
మెప్పెసఁగెడి చేష్టితముల మెఱయుచు రతులై

దొప్పిరి విలాసవతికై
చొప్పడిరి యుదారభావ సూచితమతులై. 19

—♦ యిందుమతినిగూర్చి ద్వారపాలకురాలైన సునంద యాంచెల యందుండెడి రాజులయొక్క చరిత్రలను జెప్పుట. ♦—

శ్లో. అసౌశ (21)

వ. అట్లు స్వయంవరస్థానంబునందు వారి వారి చందంబులనున్న రాజనందనులందఱు నయ్యిందుమతీ ముఖారవిందమకరందంబు మాత్రంబు పాత్రంబుగ నేత్రాంజలులం గ్రోలుచున్నంత నయ్యెడ గేహాళీవ్యవసితయగు నొక్కయతి వయ్యిందుమతిం బిలుచుకొని వికసితముఖారవిందయయి. 20

చ. అది యొకద్వారపాలినియు నాఖ్యసునందయు నాఁదగుం బ్రియంవదయగు రాజవృత్తముల వంశములన్ వినియున్నయట్టి ద
య్యది కడువక్తృరీతిగను నాడు సుభాషిణిపూరుషోక్తి య
ట్లది తెలుపం దొడంగె నికఁ నాపృథివీశుల వేఱు వేఱుగన్. 21

వ. అది యక్కుమారిని ముందుగ మగధేశ్వరు నొద్దకుఁ దీసుకొనిపోయి దానితో 22

శ్లో. కామం నృ (22)

సీ. ఈ రాజు శరణన్న వారల రక్షించు
వాఁడు గంభీరసత్వంబువాఁడు
నిలలోనజనుల రంజిలఁ జేయు సన్మతి
మగధరాజ్యంబేలు మన్నెకాఁడు
సార్థకంబనఁగఁ బ్రఖ్యాతిఁ గాంచినయాఖ్య
నతివ పరంతపుండనఁగ నొప్పుఁ
గడఁగి నక్షత్రముల్ గ్రహతార లవియున్న
రేవెల్గుచేతనె రేయి వెలుఁగఁ

తే. గలిగి జ్యోతిష్మతిగ నయ్యెఁ గాదె యట్లు
యుర్వి రాజన్యులిం కెంద ఱున్న నేమి
యితనిచేతనె యిలమంచి నృపతిఁగలిఁగి
నట్టిదయికాదె సౌరాజ్య మంద్రు దాని. 23

శ్లో. క్రియాప్ర (23)

చ. మఱియు ననేకయజ్ఞములు మానుగనెప్పుడుఁ జేయుచుండు న
త్తఱి నితఁ డింద్రు రాఁ బిలువఁ దత్పరుఁడై చనుదెంచియుండుఁ దా
నిఱవుగ నెల్లప్రొద్దు తనయిక్కకు రాక విభుండు రామిచేఁ
దెఱవ పులోమజాత విరతిన్ గురులన్ విరిఁ బెట్టదాఁ జుమీ. 24

శ్లో. అనేన (24)

తే. వీనిఁ బెండ్లాడఁ గోరుదువేనిఁ బాట
లీపురంబున సౌధసమీప మందు
నుండి నిను స్వర్ణగండ్లల నుండి సతులు
కనులుపండువుగాఁ గను గాంచఁ గలరు. 25

శ్లో. ఏవంత (25) శ్లో. తాంస్సైవ (26)

వ. ఇవ్విధంబుగ సునంద మగధేశ్వరువిశేషంబుఁ దెలిపినవిని ప్రతివచనంబులు వలుకక మౌనంబుగ నవనీపతికి నమస్కరించి హస్తంబున దూర్వాంబులించుకఁ జాఱవిడుచుచు మధూకమాలఁ బట్టుకొని యావలికివెడలిన నది యతని నొప్పరికించుట మెఱంగి పిమ్మట క్షేత్రహస్తయగు నాదౌవారికి మానస సరస్సునందు వాతోత్పన్న తరంగంబు రాజహంస నొక్కకమలంబు చెంతనుండి మఱియొక్క కమలంబుచెంతకుఁ గొంపోవురీతి నయ్యిందుమతి నన్న రేశ్వరు నొద్ద నుండి మఱొక్కన రేశ్వరునొద్దకుఁ దోడ్కొనిపోయి. 26

శ్లో. జగాద (27) శ్లో. అనేన (28)

సీ. ఇతఁడంగదేశాధిపతి సిద్ధరవిలాస
వతులచే నభిలషింపంగఁ బడిన

యౌవనసంపత్తిచే వెలుంగుచు గజ
శాస్త్రకారులును విశాలమతులు
నగువాలఖిల్యాదులను మహర్షులచేత
శిక్షలుగొన్న విశేషకరులు
గలవాఁడు యిలలోనఁ గలభోగసామ్రాజ్య
పదవుల కింద్రత్వపదగుఁడగును

తే. మఱియు రిపుహతిసేయుఁ దన్మానినులకుఁ
దరలి కన్నీరుబొట్లు ముక్తాఫలంబు
లట్లు స్థూలంబులై చనుకట్ల జాఱి
దారమునులేని సరులుగాఁ బేరుకొనఁగ. 27

శ్లో. నిసర్గ (29)

చ. వకవేకలై స్వభావముగ వాక్సతి లక్ష్మియు నొక్కరున్నచో
నొకరు గలుంగ రీతనికహో యుభయస్థితి గల్గెనోట నీ
వొకతవు చెల్మికత్తె వగుదో యుభయస్థితనైనచో బళా
ప్రకటిలు నీదుకాంతి ఋతవాక్కును ప్రేమయు నోసుభాత్మికా.

శ్లో. అథాంగ (30)

ఉ. నెయ్యముతో సునంద జననీసఖి శాసుతకిట్లుదెల్పినం
దొయ్యలి చూడ్కులన్ మలచి తొయ్యలి నాతలఁబొమ్మ నెన్ విభుం
డియ్యకొనంగఁ బోలఁ డప యేనియుఁగాదు విమర్శనంబు లే
కయ్యునుగాదు లోకమరయుంగను భిన్నరుచింజనుంగడా. 29

శ్లో. తతఃప (31)

తే. అతివ శాత్రవదుస్సహుఁడైన వాని
నూత్నముగ నుత్థితుండై వినోదముగను
దోఁచు పూర్ణశశాంకుని తుల్యముగను
జూడఁ దగువాని నొకరాజుఁ జూపె సఖికి. 30

శ్లో. అవంతి (32)

చ. తెలియు మితం డవంతిపతి దీర్ఘభుజంబులు విప్పరొమ్ము వ
ర్తుల మగు సన్నఁపున్నడుము ఘోరముతైచనురూపు త్వష్ట్రియ
న్నలితఁపు బ్రహ్మచేతఁ గడుభాసురమై తగురూప మేర్పడం
జెలువుగ శిల్పియంత్రమునఁ జేయఁగఁ బడ్డ దినేశుఁ బోలెడిన్. 31

శ్లో. అస్యాప్ర (33)

తే. సత్తగల యీతఁ డని కేగఁ గత్తలాని
గములు ముందాడి తత్పురాగ్రముల రేగు
తుమురు నెఱపుచుఁ బగతుఱ క్రొమెఱు సిగలఁ
గలుఁగు మాణిక్యములకాంతిఁ గప్పిపుచ్చు. 32

శ్లో. అసౌమ (34) శ్లో. అనేన (35) శ్లో. తస్మిన్న (36)

వ. మఱియు

సీ. అల మహాకాళాఖ్య మహాక్షేత్ర మీాతని
చేరువనుండు నా క్షేత్రమందు
నెలసిన చంద్రమౌళీశ్వరు తలయందు
నెలకొన్న నెలమె నిచ్చలు వెలుంగ
రేల నిత్యజ్యోత్స్న వేలిమి కలిమిచే
నిరతంబు ప్రియరాండ్ర సురతసుఖముఁ
బడయుచు నుండు శిప్రాతరంగానిల
కంపితోద్యాన తంగములయందు

తే. స్వైర సంచారములు సేయఁ గోరుదే
యితండు ద్యోతితబంధుపద్ముండు నగుఁ బ్ర
తాప సంశోషితద్విష త్కర్దముండు
నగును నవతున రవియనాట నంబుజాక్షి. 34

తే. అది యవంతిన రేశ్వరు నట్లుదెలుప
రాకొపహారిత హాని విరాగమునను

గాంచి గుటిసేయ దా౯ దెలికలువలత ది
వాకరుని గాంచి నిరసించుభాతిగా౯గ 35

శ్లో. తామ్రాగ (37)

ఉ. తామరసాంత రాభసమతం దగుదేహము రూపశీలముల్
రామకుఁబోల బ్రహ్మ మధురంబుగ సృష్టియొనర్చెఁ బోరుచుల్
గోము గలట్టిపల్వరుస కోమలికొప్పఁగ నట్టిరూపసిన్
భామ యనూపదేశనృపుపజ్జకుఁ దోడ్కొనిపోయెఁ బిమ్మటన్ 36

శ్లో. సంగ్రామ (38) శ్లో. అకార్య (39)

వ. సునంద యతనిఁజూపించి దానితోడనిట్లను నివ్విభుండు ప్రతీపుండు
నాఁబరఁగు నితనివంశంబున మున్ను. 37

క. దత్తాత్రేయు ననుగ్రహ
దత్తంబుగ బ్రహ్మవిద్యఁ దా౯ బడసెను లో
కోత్తరుఁడు కార్తవీర్యుఁడు
సత్తముఁడయి భూతకోట్ల సంతసపెట్టున్ 38

శా. దీపింపంగ సహస్రబాహువులభాతిం బల్మిరూపింపఁగం
జూపెంచున్నిజదోర్యుగంబున రణక్షోణిస్థలిన్ వాఁడెపో
యూపస్తంభము లెల్లెడన్నిలిపె సర్వోర్వీశుఁడష్టాదశ
ద్వీపక్షోణుల సర్వయజ్ఞములు దావేర్వేఱఁ గావింపుచున్. 39

వ. రాజనందనా వినుమితండు బ్రహ్మజ్ఞాన సంపన్నత్వంబున యోగినా
బరఁగి సార్వభౌమపదంబున సర్వభూపులయు పరిపాలనంబొనర్చుచు
ననన్యసాధారణరాజ శబ్దంబుగలవాఁడగు మఱియు. 40

తే. జనులు దుష్కార్యవర్తనఁ జనఁగఁ దలఁచు
నపుడె శాపధరుండు ప్రత్యక్షభూతుఁ
డగుచు శిక్షించువారల కట్టితలఁపు
వర్జనము గాఁగఁ గార్తవీర్యార్జునుండు. 41

శ్లో. జ్యాబంధ (40)
శా. దేవేంద్రున్ బవరంబునం గొనిన జేతృన్ రావణున్ మార్గణ
జ్యావల్లీ చణబద్ధవింశతిభుజ స్తంభ స్థితిం జేసి కా
రావాసంబునఁ బెట్టి వక్త్రదశకంబుం దొయ్య నిట్టూర్పు లు
గ్రావాప్తిన్ వెడలించుచుండ విడిచెన్ సానుగ్రహస్ఫూర్తియై. 42

శ్లో. తస్యాన్వ (41)
ఆ. అట్టి కార్తవీర్యు నన్వయమునఁ బుట్టె
నీ ప్రతీపుఁడాగమప్రవృద్ధ
సేవి చపలలక్ష్మి కేవగు సంశ్రయ
దోషజునుపవాదుఁ దొలఁగువాఁడు. 43

శ్లో. ఆయోధ (42)
ఉ. మానిని యివ్విభుండు నృపమాత్రుఁడె దీర్ఘభుజద్వయుండు వై
శ్వానరు సుప్రసాదమున భార్గవురాట్కులకాళరాత్రియుం
బోని కుఠారధార వెలుపుంగొనకే యని నుత్పలచ్ఛదా
గ్రానుపమానసారముగ నాతఁడు భావనచేసెఁ బోసుమీ. 44

శ్లో. అస్యాంక (43)
తే. లలన యితనికి వామాంక లక్ష్మివగుము
సరళ మాహిష్మతీపుర సౌధజాల
రంధ్రములనుండి పరిఖ లట్లవలఁ గొన్న
రేవ వెల్లులఁ జూడఁ గోరెదవుయేని. 45

శ్లో. తస్యాఃప్ర (44)
వ. అని యనిన 46
తే. అన్న రేంద్రుండు సొంపారి యున్న నేమి
నెలమొగులు లైటితొలఁగు వెన్నెలలయింపు
సరకుసేయని తామరసంబులాగు
యిందుమతి యేమి హానిపసందు గనదు. 47

శ్లో. సాశూర (49)

క. అట్లది యతని వరింపఁ నొల్లమి మొఱఁగి సునంద యయ్యిందుమతి
నింకొక్కని యొద్దకుం దోడ్కొనిపోయి 48

ఆ. శూరసేనవిభుఁడు శూరుండు లోకాంత
రప్రగీతకీర్తి రమణమూర్తి
యుభయవంశ వర్ధనోచితుం డితఁడని
చెలికిఁ జూపె నది సుషేణు నపుడు. 48

శ్లో. నీపాన్వ (46)

ఆ. నీపవంశభవుఁ డనేక యజ్ఞంబులు
శాస్త్రసమ్మతముగఁ జలుపువాఁడు
యితఁడు శాంతమూర్తి యిందీవరాక్షి యీ
పతివిశేషగుణము లతులితములు. 50

ఉ. చాన ఋషీశ్వ రాశ్రమము సన్నిధిసింహ గజాదులైన దు
ర్మానసవైరిసత్వ విసరంబు పరస్పరవైరభావమున్
మాని చరించినట్లు లవమాత్రము భేదములేక వర్తిలున్
జ్ఞానము మాన మాదిగను ఉంటగొనంబులు వీనియందునున్. 51

శ్లో. యస్యాత్మ (47)

ఉ. ఈతనిమూర్తివంతమున నింపగుకాంతి స్వగేహమందు వి
ఖ్యాతిగఁ జంద్రచంద్రికల యట్లుగఁ జల్లఁదనంబు నించు ను
జ్జాత నిజప్రతాప మరిసద్మములందుఁ దృణాంకురంబులన్
భీతి గలుంగునట్లు మొలపించుఁ బలాయితవైరివాసమై. 52

శ్లో. యస్యావ (48)

తే. ఇతని యంతఃపురస్త్రీలు సతము జలక
మాడువేళలఁ గుచగంధ మందుఁగడుఁగఁ
బడినజలములఁ దెలువెక్కి-వఱలె మధుర
కడయమున దవ్వు మినువాఁకఁ గలసినట్లు. 53

శ్లో. త్రస్తేన (49)

ఉ. ఈనృపు పూర్వులైన పృథివీశులు తొల్లి ఖగేంద్రుబారికిం
దానతిభీతి నీయమున దాఁగినకాళియుఁ డత్కుమాని నె
మ్మానసఁగ వారు వానికిఁను నయ్యభయంబు నకుంగ్రయంబుగాఁ
దా నొక మానికంబిడుపదంతి పరంపరగా వినంబడున్. 54

క. వారలనాఁటిది యగు సొం
పారినమణి నీసుషేణపతి కడు మెఱయం
భేరురమునఁ దాలిచి ధి
క్కారించుం గృష్ణు నుఱకఁ గౌస్తుభధారిన్. 55

శ్లో. సంభావ్య (50)

వ. కావున

ఉ. యౌవనవంతుఁడైన విభవాధికుఁ డీతఁడు భర్తగాఁగ నీ
వీవిభుతోడఁగూడుకొని యీతని చైత్రరథంబువోని బృం
దావనిలోనఁ బల్లవయుతంబగు క్రొవ్విరిపాన్పుపై సుఖం
బావహిలంగ నీదయిన యౌవనసత్ఫల మారగింపుమా. 57

శ్లో. అధ్యాస్య (51) శ్లో. నృపంత (52)

సీ. ఇంతమాత్రంబెకా దింతిరో గోవర్ధ
నాద్రికందరముల యందువాన
కాలంబులో నను గలుఁగు వాననీరి
బొట్లుచేఁదోఁగురాపువ్వు వలనఁ
గలుఁగువాసనల రంజిలు బండరాలపై
నెమ్మి మొత్తములు నృత్యమ్ము సేతఁ
జెన్నారఁ గాంచెద వన్న నాతనివంకఁ
గన కన్యపత్ని కాఁ గలది గాన

తే. సాగరముఁ జేరఁ బఱతెంచి చన్నయట్టి
వాహినియు మార్గమున వశపడినపర్వ

తటమును దఱిసినయట్టివిధంబుగాఁగ
నదియు నావర్తనాభియై యవలకరిఁగె. 58

శ్లో. అథాంగ (53)

ఉ. అంగన పూర్ణచంద్రముఖి యయ్యది యంతటఁ జోరిలోన శ
త్రుంగొనువాఁడు బాహుపురులుం గలవాడగుమన్నుతేడు హే
మాంగదుఁడన్ గళింగపతియంతికముందఱియంగ నాసునం
జాంగన కింకరీలసితవహానుడి బాలను బల్కరింపుచున్. 59

శ్లో. అసౌమ (54)

చ. గిరిజల దుర్గమంబులుగఁ గీల్కొనియున్నవి యామహేంద్ర భూ
ధరము మహాబ్ధి యేలుమహితస్థితి నీతని కీతఁడున్ మహా
స్థిరత మహేంద్రతుల్యుఁ డగు జిత్వరుఁ డీతని జైత్రయాత్రలం
దరలిన సేనముందఱి మదద్విపముల్ పురుడున్ మహేంద్రమున్.

శ్లో. జ్యాఘాత (55)

తే. రెండు భుజముల జ్యాఘాతరేఖ లవ్వి
నలుపుఁ దేఱిన చాయలు గలిఁగియుంట
శాత్రవశ్రీలు తద్భుజస్కంధములను
కజ్జలాశ్రువులు కార్చుట గాఁగఁ దోఁచు. 61

శ్లో. యమాత్మ (56)

తే. రేయిఁ దా సౌధమున నిదురించు చుండ
జాము నను జేయు తూర్యఘోషముల మించి
జాలములనుండి యలల దృశ్యముగఁ దోఁచి
జలధి మ్రోతలఁ దన్ను మేల్కొలుపు చుండు 62

శ్లో. అనేన (57) శ్లో. ప్రలోభి (58)

సీ. మరమర యనుచు ఘుమ్మరముగాఁ గమ్మ చ
ప్పుళ్ళొనర్చెడి తాళభూరుహములు

కాజిల్లు సింధుతీరములందు ద్వీపాంత
రములనుండి లవంగ సుమచయంబు
గొని తెచ్చువాయువు లనుభవింపుచు స్వేచ్ఛ
విహరింపవచ్చు నీ విభునిఁగూడి
యని యాసుపరిద తార్చిన స్వరూపాకర్ష
ణీయ భోజునకుఁ గవిష్ఠకన్య

తే. కయగు నారాచబిడ్డ యొకళ్ళవలనఁ
గడు దవులనుండి గొని తేరఁ బడిన లక్ష్మి
దైవ మనుకూలపడమిచేఁ దరలి చనుట
వలె నతనియొద్దనుండి యావలకుఁ జనియె 63

శ్లో. అథోర (59) శ్లో. పాండ్యోఽయ (60)

వ. తరువాత సునంద పాండ్యరాజుం జూపించి యిట్లను 64

తే. అదిగో చూచితివే చకోరాక్షి యితఁడు
నాగపురనాథుఁ డసమానభోగశాలి
దేవసముఁడు మహాభాగధేయుఁ డతని
నరసి చూడుము పాండ్యదేశాధిపుండు. 65

తరలము॥ ఇతఁడు భాసురతన్ వెలుంగు మహీశుఁడంసతల ప్రలం
బిత సుమౌక్తికహారముల్ తనుభిత్తినిన్ హరిచందనా
ద్భుత విలేపన రాగముల్ నెత్తఁ దొంగలింప లసజ్ఝరీ
స్రుతుల బాలరవిద్యుతిన్ విలసిల్లు సానుల నద్రిగన్. 66

శ్లో. వింధ్యస్య (61) శ్లో. అస్త్రం హ (62)

సీ. తపనమార్గము నిరోధం బొనర్పఁగఁ బెచ్చు
పెరిఁగిన వింధ్యాద్రి పీఁచమడఁచి
సాంతంబుగా సముద్రాంబువుల్ పుకిసిట
గ్రోలి యప్పాట గ్రక్కునను గ్రక్కి

తనమహత్త్వం బద్భుతంబుగాఁ గొనియాడ
గణనఁ గైకొన్న యగస్త్యమహాని
తా నెవ్వఁ డశ్వమేధముఁ జేయ నవభృథ
మైనవోఁ దనకార్య మరసి యడిఁగెఁ

తే. దప జనస్థానమున కుపద్రవము గలుఁగ
కుండ నెవ్వాని తో రావణుండు సంధి
చేసికొని యింద్రపురి గ్రేణిసేయ వెడలె
నట్టి పాండ్యక్షమాధీశు నరయఁ గలవె. 67

శ్లో. అనేన (63) శ్లో. తాంబూల (64) శ్లో. ఇందీవ (65)

వ. అబలా ఖరాలయంబగు నాజనస్థానంబునకు సమీపమందున్నవాఁడగు నితండు పరమేశ్వరునివలనం దుర్లభంబైన బ్రహ్మశిరో నామ కాస్త్రంబుఁ బడసె నితనికి లంకాపతి శంకించుంగాదే సత్కులప్రసూతుండును రత్నంబులతోడిసముద్రంబుగల దక్షిణదేశంబునకు విభుండు నగు వీని నీవు యథాశాస్త్రంబుగఁ బాణిగ్రహణంబు చేసుకొని యితనికిఁ బట్టమహిషివగు మట్లయినఁ గ్రముకంబుల నల్లుకొని యుండెడి నాగవల్లీ వితానంబులును జందనతరుల గిరుకొని యుండెడి యేలకీలతానీకంబులును శయ్యలంబోలె నొయ్యన తాలియుండెడి తమాలపత్రప్రతానంబులునుం గలిఁగెడి నొడికంబుగల మలయపర్వతా కృత్రిమ ప్రదేశంబులందు నెడనెడ రతులం బడయంగలవు మఱియు నిందీవరశ్యామలవర్ణుండగు వీనికిని గోరోచన గౌరశరీరిణివగు నీకును గలిఁగెడి సంబంధంబు గూడెడి విద్యున్మేఘంబులకుం బోలెడి చాడ్పైన ప్రకాశించుంగాదే.

శ్లో. స్వ సుర్వి (66)

తే. అనిన నమ్మాట భోజునీ యనుజమతికిఁ
బట్టదాయె సూర్యదర్శనా భావమునను

ముడుఁగఁ బాఱిన తామరపువ్వులోనఁ
జంద్రకిరణంబు సొరవని చందమునను 69

—♦ రాజులు యిందుమతి తమ్ము నతిక్రమించి పోవుటచే
నిస్తేజస్కత్వము నొందుట ♦—

శ్లో. సంచారి (67)

తే. ముందు మఱుఁగేమి లేని రాణ్మందిరోర్ధ్వ
శాలలో దివ్వె చేఁగొని చనఁగ వెనుక
నిల్లె యగునట్లు నెయ్యె నరేంద్రు దాఁటి
చనెనొ సతి వానిమోము విచ్ఛాయ మయ్యె. 70

—♦ అజునికి శుభసూచకముగా దక్షిణ
బాహువు చలించుట. ♦—

శ్లో. తస్యాంర (68)

వ. అట్లు పాండ్య రాజును వరియింప నొల్ల కయ్యిందుమతీదేవి యతని యొద్దనుండి యవలకు జరుఁగుచున్నంత నదితనకు సమీపంబగు చున్నయది గాన రఘుసూనుండు దానిం గాంచి. 71

తోటకవృత్తము. ఇది నన్ను వరింపఁగ నియ్యకొనం
గ దిగానయొనర్చునొ గైకొనునో
యని నాకుడి ప్రక్క భుజాగ్రము బి
ట్టదరెన్ సందియ మూరె నికన్. 72

శ్లో. తంప్రాప్య (69) శ్లో. తస్మిన్ స (70)

వ. అని యిట్లయ్యజుండు శంకదక్కి నిశ్శంకనుండె నప్పుడు 73

—♦ యిందుమతి మఱియొక్క రాజుయొద్దకుఁ బోవనిచ్చునువద
లుట అజుని చరిత్రమును వర్ణించుట. ♦—

సీ. విరిసిన తియ్యమావిని జేరు మధుపాళి
పరమహీజముఁ జేరఁ బఱవని గతి

సర్వాంగసుందరుం డుర్వీధరాంగజుం
డైన యయ్యజమహీజానిఁగాంచి
యక్కుమారియును వేఱొక్కనియొద్దకుఁ
బోవలె ననుమది పోకలుడిఁగి
యతనియందున మనం బదిచేర్చి పెటిఁగి య
య్యిందుప్రభాసమానందమూర్తి

తే. నతిమనోహరముగ నలరారుదాని
కాద్యనంతరసందర్భ మరయఁగలుఁగు
వక్తృతయుఁగల యాద్వారి వానిఁగూర్చి
చెప్పఁదొడఁగె నుదంతంబుఁ జెలి వినంగ 74

శ్లో. ఇక్ష్వాకు (71) శ్లో. మహేంద్ర (72)

సీ. ఇక్ష్వాకువంశ్యరాజేంద్రులలోనఁ బ్ర
సిద్ధగుణంబుల శ్రేష్ఠుఁడయిన
యలకకుత్థ్సమహీశు నన్వయ మందున
నతనివెన్కను బుట్టినట్టిసుగుణు
లైన యుత్తరకోసలాధీశు లాదిలీ
పాదులు కాకుత్థ్సు లనఁగఁ బరఁగు
నాకకుత్థ్సుఁడు మహోత్సాహకారుఁడగు సురే
శ్వరునెక్కి యామహేశ్వరుని లీల

తే. నని సురద్విషులను శరాసనహతులుగఁ
జేసెఁదత్సతీగండస్థలీసకలిత
మకరికాపత్రరేఖలు మాసిపోవఁ
బతివియోగార్తిచింత లాఁతులు పొంద. 75

శ్లో. ఐరావ (73)

లయగ్రాహి

వాసవుఁడు వెండి వృషభాసమగురూపమును
బాసి నిజరూపమున భాసిలి దివౌకో
వాసకరి బుజ్జగముఁ జేసి నెఱి లప్పళము
సేసి శిధి లాంగద విలాసభుజుఁడై సిం
హాసనము మీఁద సుఖవాసముగ నుండఁ దన
తోసరి నిజాంగదము రాసికొనఁ దా న
ర్ధాసనము నందు సువిలాసముగఁ గూర్చొని వి
భాసిలెఁ గకుత్స్థుఁడు వికాసము చెలంగన్. 76

శ్లో. జాతః కు (74)

ఉ. ఆతని వంశమందున మహాయశుఁడుం గులదీపకుండు ను
జ్జాతమయెన్ దిలీపుఁ డురుసత్త్వుఁ డతండు శతక్రతుత్వ్యాయ
త్తాతిశయుండునై క్రతువు లాదటఁ దొంబది తొమ్మిదింటిఁ దా
క్షేతగఁ జేసి నూఱవది చేయకమానె సురేంద్రు ప్రీతికై 77

శ్లో. యస్మి న్మ (75)

తే. అతఁడు రాజ్యంబు పాలించునట్టి తఱిని
ప్రియవిహారార్ధపథిని నిద్రించినట్టి
మెడల మత్తాంగనలచేల మెగయు గాలి
జంకు నటె సొత్తుగొనఁ జెఱు సాచు నెవఁడు. 78

శ్లో. పుత్రోర (76)

మత్తకోకిల. ఆ దిలీపుసుతుండు రాజ్య పదానువర్తనవేళఁ బ్రా
గాది సర్వదిశల్ జయించి యనంతసంపదఁ గూర్చి స
త్త్వాదరుండు రఘుండు విశ్వజిదాఖ్యయజ్ఞముఁ జేసి సం
పాద మంత వ్యయించె మృణ్మయపాత్రశేషముఁగాఁగ దున్.

శ్లో. ఆరూఢ (77)

శా. ఆరోహించె గిరివ్రజం బుధధులన్ సాంతంబుగా దాఁటె నే
పారం బన్నగలోకముం గుహరపర్యంతంబుగాఁ దూఱె సాం
తారోకంబుగ స్వర్గలోకము విహాయఃపూర్తమైపొందె వి
స్తారంబై తనకీర్తిమేరఁ గన మూసాదించెఁ గాలత్రయిన్. 80

శ్లో. అసౌకు (78)

తే. ఆ రఘునిసుతుఁ డజుండు స్వర్గాధిపతికు
మారుఁడైన జయంతుండుమాడ్కిఁ దండ్రి
కనుసృతుండయి పుట్టి యాతనికి సరిగ
జగతి యువరాజపదవి బాసట వహించె. 81

శ్లో. కులేన (79)

తే. కులము రూపంబు నవవయోవిలసనంబు
వినయమును శీలమును గల విభుఁ డితండు
నీకు నెనయగు మెఱయు వీనిని వరింతు
వేని సమకూడు మణియుఁ గడానియటుల 82

—♦ యిందుమతి తన యనురాగముతో చూచుట
మొదలగు చిహ్నములు. ♦—

శ్లో. తతస్సు (80)

ఆ. అని సునంద చెప్పఁగను విని పిమ్మట
నన్నరేంద్రసుత ప్రసన్న దృష్టి
నగుమొగంబు సైకమగుసిగ్గు చెయ్యోలి
మనువుసరి నిడంగఁ గనియెఁ బతిని 83

—♦ మఱియొక్క రాజునుగూర్చి పోవుదమాయని పరిహాస పూర్వకముగా నుడివిన సునందను యిందుమతి పోరిచూపు చూచుట, అజునిమెడలో నిందుమతి పూలహారము సమర్పించుట. ♦—

శ్లో. సాయూని (81) శ్లో. తథాగ (82) శ్లో. సాచూర్ణ (83)

సీ. అతనియం దనురాగ మతిశయిల్లిన సిగ్గు
చేఁ గప్పఁబడఁగ నాచేడి యకును
న్నుల్లమందునఁ గల్గు నుల్లసంబున గరు
పాటిన మెనఁ గన్పట్టి నంతఁ
జెలి యయ్యరాళకుంతలఁ గాంచి చెలియరో
యింకొక పతికడ కేగుదము య
టంచును నది పరిహాసంబు గావింప
నయ్యార్య సహింయింప కలుకఁ జూపు
తే. చలరి యనురాగమునఁ గుంకుమారుణమగు
పూలహారంబు నాదాది కేలువట్టి
తనకరంబులతోడ నాతనికి నిడియె
నురుగళంబునఁ గరభోపమోరుయుగళ. 84

—♦ అజుఁడు ఇందుమతి బాహుపాశార్పణముచేఁ గలిఁగిన సుఖము ననుభవించుట. ♦—

శ్లో. తయాస్ర (84)

ఉ. ఆరఘునందనుండు తన కయ్యువతీమణి గారవంబుతోఁ
బేరురమందు నిప్పసరి వ్రేలఁగ వేసిన నామె తత్కర
స్ఫారయుగంబు సాచి మెడపైనిడి తన్నుఁ గవుంగలించి బి
ట్టూరఁగఁ జేసికొన్నటుల నూహయొనర్చుకొనెం గడున్ మదిన్.

—♦ సమగుణములు గలవారియొక్క దాంపత్యము నుద్దేశించి రాజులయొక్క శ్రవణములకు కాఠిన్యము కలుగునట్లు పౌరజనములు నుడువుట. ♦—

శ్లో. శశిన (85)

చ. సమగుణు లిందు మత్యజులు చక్కఁగఁ గూడఁగ వేడ్కతోడ నీ
కొమ యనురూపుఁడైన శశిగూడినచంద్రిక సువ్వె యీమె సా
మ్యమగుణబోధిఁ గూడినవియన్నది సూ యని యాస్వయంవరో
ద్యమమునఁ జేరుపౌరు లని రచ్చోట రాజుల వీనుపోటుగన్. 86

—♦ అజ సంబంధి రాజసమూహము సుఖమును
ఇతరరాజసంఘము దుఃఖము ననుభవించుట ♦—

శ్లో. ప్రముది (86)

తే. ఉదయమునఁ బూయుతమ్ములు నోలి మోడ్పు
గొనిన తెలికల్వలసను గల్గు కొలనువలెఁ బ్ర
సన్నముఖములఁ దోఁచె నజపతి బంధు
వితతి ఖిన్నాన్యములఁదోఁచెఁ బెండ్లిదొరగమి. 87

సర్గాంతము

ఉ. సవనవిధానసర్వవిద సర్వముఖానుభవప్రసిద్ధ వా
సవ సురమౌని సర్వజనసన్నుతపాదసరోజ నిత్యసం
భవమరణార్తిదూర నుతభవ్య నిరామయమూర్తికల్ప దృ
గ్వివశ విశాలమోహతమ కేవలమోక్షనిధాన సత్తమా. 88

క. ఔపాధిక నామహృతి
పాపిపణపారీణ వేదపారాయణ వి

ద్వాపర వినోదకారణ
దీవనధీరప్రమాణ దీనధురీణా. 89

మాలిని

దివిజ వినుతకీర్తి దివ్యచారిత్రవర్తీ
భువనభర నివారీ పుణ్యకర్మాను సారీ
త్రివిధగుణ వికల్పీ తిగ్మరోచిష్ప్రకల్పీ
స్తవనజనవినోదీ సర్వ పాప్మాప నోదీ. 90

గద్య

ఇది శ్రీమదక్షరపరబ్రహ్మవందనాభిలాష పరమానందభరిత
మనీషావిశేష మరిచెర్ల వంశపయఃపారావారరాకా
సుధాకర వినుతగుణాకర పరోపకారసూత్ర
శివున్నాయకసుపుత్ర బుధజనవిధేయ
జగన్నాథనాయకనామధేయప్ర
ణీతంబైన రఘువంశమహా
కావ్యంబునందు
షష్ఠ సర్గము



Printed at Sri Chintamani Press, Rajahmundry E. G. 36 for M. Jagannadha Naidu, Lakhanapurani Paper permit No. D Dis. P. Con A 2337/47 of the Provincial Paper Controller, Madras. Copies 900. 20—10—47



వలయువారు :—

మరిచెర్ల జగన్నాధనాయుడు

అఖణాపురము

(నాగూరు పోస్టు, పార్వతీపురము తాలూకా, విశాఖపట్టణము జిల్లా)

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.